## అంకితం



హైదరాబాదు రాష్ట్ర కార్మికోద్యమ ప్రథమదశలో,
నిర్మాణ కార్యక్రమంలో ప్రముఖపాత్రవహించి
కార్మికవర్గానికి అపారమైన సేవచేసిన నాఅగ్రజుడు
రామచంద్రరావుకి

—గ్రంథకర్త.

# విషయ సూచిక

# మొదటి మాట

నా చైనా ప్రయాణం 1954 వ సంవత్సరంలో తలవని తలంపుగా సంభవించింది. దీనికి కారకులు నా చిరమిత్రులూ, కార్మికోద్యమంలో నాకు గురుతుల్యులూ అయిన శ్రీ గురుస్వామి గారు. వీరు గత 40 సంవత్సరాలలో భారత కార్మిక వర్గానికీ–ముఖ్యంగా రైల్వే కార్మికులకు–చేసిన సేవ చరిత్రాత్మకమయినది. వీరు భారతదేశంలోనే కాకుండా, ఖండాంతరాలలో కూడ పేరు ప్రతిష్టలు పొందిన నాయకులు. వీరి సహాయము, ప్రయత్నము లేకుంటే నాకు నవచైనాను దర్శించే అవకాశమే దొరికేదికాదు. వారికి నా కృతజ్ఞతా పూర్వక వందనాలు.

నవచైనా పర్యటనకు నన్నాహ్వానించి, అక్కడి పరిస్థితులను అవగాహన చేసుకోడానికి అఖిలచైనా కార్మిక కేంద్రసంస్థ (All China Federation of Trade Unions) కార్యకర్తలు మాకెంతో సహాయంచేసి అనేక సదుపాయాలు కల్పించారు. వీరికి కూడ నా హృదయపూర్వక నమస్కృతులు.

చాల తక్కువ వ్యవధిలో హైదరాబాదు ప్రభుత్వంవారు నాకు ప్యాస్‌పోర్టు దయచేశారు. రైల్వే అధికారులు కూడ కోరిన సెలవునిచ్చారు. లేకపోతే నా చైనా ప్రయాణం అసంభవ మయ్యేది. వీరికి నా ధన్యవాదాలు.

నవచైనాకు వెళ్ళడము, తిరిగి వచ్చిన తరువాత నా అనుభవాలను ఉపన్యాసాలవల్ల, వ్రాతలవల్ల తెలపడము విని కొందరు మిత్రులు నా "రంగు మారిపోతూంద"ని అన్నారు. వీరు నా ఉపన్యాసాలను వినకుండా, నా వ్రాతలను చదవకుండా యిటువంటి అభిప్రాయాన్ని తెలపడం నాకు కొంత విస్మయాన్ని కలిగించింది. వీరి

అభిప్రాయాలు కేవలం భ్రమజనితమైనవని జంకు లేకుండా చెప్పడానికి సాహసిస్తున్నాను.

ఏ రాజకీయ సంస్థతోను సంబంధం లేకుండా, గత 30 సంవత్సరాలలో నేను కార్మికోద్యమంలో స్వతంత్రునిగా వ్యవహరించాను. అందువల్ల సామ్యవాదులు సంస్కారుల జాబితాలోను, మితవాదులు తీవ్రవాదులలోను నన్నిదివరకే జమకట్టేశారు. నవ చైనాలో నా పర్యటనానుభావాలను, పరిస్థితులను చూచినది చూచినట్లు, గ్రహించినట్లు నా దినచర్య పుస్తకంలో ఎప్పటికప్పుడు వ్రాసుకున్నాను. ఆ వివరాలను ఆధారం చేసుకుని యీ వ్యాసాలు వ్రాశాను. ప్రాచీన విజ్ఞానానికి, సంస్కృతికి, నాగరికతకి ప్రఖ్యాతి వహించిన చైనావంటి గొప్ప దేశాన్ని గురించి వ్రాయడానికి పూనుకోవడం సాహసమే. అందువల్ల నా బాధ్యతను మరచిపోకుండా వ్రాయడానికి యత్నం చేశాను. నా గ్రహణశక్తిలో, దృష్టిలో లోపాలుంటే ఉండవచ్చు.

ఈ పుస్తకంలో నేను దర్శించని తైవాన్ దీవిని గురించి ఒక ప్రకరణం వ్రాయడం అవసరమని తోచింది. తైవాన్‌ని గురించి వ్రాయకుండా వదలడం నే నర్థంచేసుకున్న నవచైనా భవిష్యత్తుకి, భద్రతకి సంబంధించిన ఒక ముఖ్య విషయాన్ని విస్మరించడమే అవుతుంది.

భారత - చైనా దేశాల ప్రజలు ఒకరినుంచి ఒకరు నేర్చుకో తగిన విషయాలెన్నో ఉన్నాయి. ముఖ్యంగా భారత కార్మిక వర్గము, నాయకులు దేశ పునర్నిర్మాణ కార్యక్రమాల్లో తమ బాధ్యతలను నిర్వహించవలసిన విషయంలో నవచైనా కార్మికవర్గం నుంచి, కార్మిక నాయకత్వంనుంచి నేర్చుకోవలసిన గుణపాఠాలెన్నో ఉన్నాయి.

నవ చైనా పర్యటించినవారిలో (అందులోను కార్మిక వర్గానికి చెందినవారిలో) తమ అనుభవాలను ఆంధ్రంలో వ్రాయడం

యిదే తొలిసారి అనుకుంటాను. ఈ పుస్తకం నవచైనాను అర్థం చేసుకోడానికి పాఠకుల కేమాత్రమైనా ఉపకరిస్తే, నా కర్తవ్యాన్ని నెరవేర్చగలిగిన వాణ్ణయ్యానని సంతృప్తి పొందగలుగుతాను.

బీదరికంలో పుట్టి పెరిగి, చిన్నతనంలో విద్యాభ్యాసానికి అవకాశంలేక, బాల్యంనుంచి జీవిత పోరాటంలో కార్మికవర్గంలో చేరి, కాయకష్టంతో ఉదయంనుంచి అస్తమయంవరకు చెమటోడ్చి పొట్టపోసుకోడంలోను, అప్పటినుంచీ కార్మికోద్యమంలో ప్రవేశించి పోరాటాలు కొనసాగించడంలోను నా వయస్సు గడచింది. అనుభవంవల్ల కలిగిన మానసిక పరివర్తన, స్వయంకృషివల్ల పొందిన సంస్కారం తప్ప నా రచనలకు యితర యోగ్యతలేవీ లేవు.

నా వ్యాసాలను తమపత్రికలో ప్రకటించి విశాలాంధ్ర పత్రికాధిపతులిదివరకే నన్ను ఆంధ్రలోకానికి పరిచితుణ్ణి చేశారు. వాటి నిప్పుడు పుస్తకరూపంగా ప్రకటించి, విశాలాంధ్ర ప్రచురణకర్తలు వాటికొకరూపం కలిగించి, నన్ను గౌరవించారు. వారికి నా హృదయపూర్వకాభివందనములు.

సికిందరాబాదు,
1-12-1956.

నందిరాజు రాఘవేంద్రరావు.

# 1

# హాంకాంగ్ నగరం

ఆరవైకోట్ల ప్రజానీకం అజ్ఞానంనుంచి, బీదరికంనుంచి, సామ్రాజ్య వాదుల బహిరంగ లూటీనుంచి, భూస్వాముల దోపిళ్ల నుంచి, అవమానభరితమైన జీవితాన్నుంచి విముక్తిపొంది సౌఖ్యంతో, ఆనందంతో, స్వతంత్రంతో నవ్యజీవితం అనుభవిస్తూండే చైనాప్రజల్ని చూడటానికి, వారితో కలసిమెలసి కొన్ని దినాలు గడపడానికి, వారి అనుభవాలను, కష్టాలను, త్యాగాలను గురించి తెలుసుకోడానికి, నిరంకుశ ప్రభుత్వ విధానాన్ని నామ రూపాలు లేకుండా చేసిన స్త్రీ పురుషుల సాహస చరిత్రలను విని గర్వపడడానికి, స్వతంత్రంపొందిన తరువాత చైనాప్రజలు తమ దేశపురోభివృద్ధికి చేసినకృషి, చూపిన పట్టుదల, ప్రదర్శించిన ఉత్సాహం, కనపరచిన కార్యశూరత కళ్ళారా చూడడానికి—నాకు అవకాశం కలిగింది. అఖిలచైనా కేంద్ర కార్మిక సంస్థ ఆహ్వానంపై నేను చైనాకు వెళ్ళాను.

ఇటువంటి అవకాశం సునాయాసంగా, అయాచితంగా దొరికినా, దాన్ని అంగీకరించడానికి నా కెన్నో ప్రతిబంధకాలేర్పడ్డాయి. అన్నిటికంటె పెద్ద చిక్కు—వ్యవధి చాలా తక్కువ. వారం రోజులలో ప్యాసుపోర్టు సంపాదించాలి; ప్రయాణానికి తగిన సన్నాహాలు చేసుకోవాలి. ఇవి అంత తేలికగా సమకూరే విషయాలు కావు. అయినా కొంత ప్రయాసమీద ఇవి సాధించుకో

గలిగాను. హైదరాబాదు ప్రభుత్వం ఎటువంటి అడ్డంకులూ పెట్టకుండా ప్యాసుపోర్టును వారంరోజులలో యిచ్చింది. సెలవుకూడా సునాయాసంగా దొరికింది.

ఏప్రిల్ 23 వ తేదీనాడు ఢిల్లీనుండి పాన్ అమెరికన్ ఎయిర్వేస్‌వారి విమానంలో హాంకాంగ్‌కు ప్రయాణమయ్యాను. విదేశయాత్ర కిదే మొదటిసారి. విమానంలో కాలు పెట్టగానే నా మనస్సులో ఎన్నో ఆలోచనలు తలెత్తడం ప్రారంభమైనాయి.

నాకు చైనాభాషరాదు. వాళ్ళ ఆచార వ్యవహారాలు అసలే తెలియవు. అక్కడి ప్రజల ప్రవర్తనను గురించి ఊహించుకోడాని కయినా తగిన అవకాశంలేదు. ఇదివరకు చైనాకుపోయి వచ్చిన వాళ్ళనడిగితే, పరస్పర విరుద్ధమైనభావాలు వెలిబుచ్చారు. వీళ్ళంతా చైనాదేశాన్ని తమ సంకుచిత రాజకీయ దృష్టితో పరిశీలించి అవగాహన చేసుకున్నవాళ్లు. వీళ్లనడగటంకంటె అడగకుండా వుండడమే మంచిదనిపించింది. మనస్సు నిర్మలంగాను, విశాలంగాను ఉంటే మనం యితరుల విషయంలో పొరబడకుండా అర్థంచేసుకునే అవకాశం యెక్కువ వుంటుంది. లేకపోతే ముందే యేదో ఒక అభిప్రాయంతో ప్రతివిషయాన్నీ, ప్రతివ్యక్తినీ గురించి ఆలోచించడం ఒకొక్కప్పుడు తప్పుడు అభిప్రాయాలకీ, యింకొకప్పుడు సరియైన అభిప్రాయాలకీ మనస్సులో తావుకల్పించుకోవడం జరుగుతుంది. ఇందువల్లనే మనం అనేకసార్లు సత్యానికి అనేక భిన్నస్వరూపాలు కల్పించుకుంటూ వుంటాం. ఈవిషయమై చైనాలో నా అనుభవం మంచిపాఠంనేర్పింది.

24 వ తేదీ 10 లేక 11 గంటలకు విమానం హాంకాంగ్ చేరింది. కష్టమ్సు డిపార్టుమెంటు వాళ్లు నా పెట్టె తనిఖీ చేశారు. అక్కడ జరగవలసిన కార్యకలాపం చాలావుంది. ఇదంతా ఒక అర్ధగంటలో జరిగిపోయే విధానం. విమానాశ్రయం నుంచి బయటపడ్డాను. కాని యెక్కడికి పోవాలి? ఏం చేయాలి? అనేది

సమస్య. బయటకు వస్తూండగా న్యూచైనా ట్రావెల్ ఏజెన్సీకి సంబంధించిన ఒక చైనా మనిషి నా వైపు వచ్చాడు. నాపేరు వ్రాసివున్న కాగితం చూపించాడు. వచ్చీరాని యింగ్లీషులో తనతో రమ్మని చెప్పాడు. అతడికంటె నా కక్కడ స్నేహితులు గాని, బంధువులుగాని లేరు. అతడు నన్ను కౌలూన్ హోటలులో నాకోసం ఇదివరకే సిద్ధంగావుంచిన ఒకగదిలోకి తీసుకొనిపోయాడు. అక్కడ నాకు ఇంకో భారతప్రతినిధితో పరిచయం కలిగింది. ఇతడు సియాబిహారీ శరణ్; యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు ప్రతినిధి. మా యిద్దరికీ పరిచయం అక్కడే కలిగింది. ఇతడు నాతోపాటు విమానంలోవచ్చిన మనిషే కాని, మా యిద్దరకూ విమానంలో పరిచయం కలిగే అవకాశం లేకపోయింది.

కొంతసేపటికి న్యూచైనా న్యూస్ ఏజన్సీఉద్యోగి ఒకాయన వచ్చాడు. ఈయనకు యింగ్లీషు బాగా వచ్చు. మా ప్రయాణం గురించి, మా వసతి గురించి జరిగిన ఏర్పాటులన్నీ తెలిపాడు. ఈయన సత్ప్రవర్తన కలిగిన వ్యక్తి అని మాటలలో తేట పడింది. అనుభవంగలవాడు. అంతేకాకుండా నవచైనాలో తర్ఫీదు పొంది జీవితంలో కొత్తదనాన్నీ, పురోభివృద్ధినీ పొందినవాడు. కొద్ది నిమిషాలలో మేమిద్దరం స్నేహితులమైపోయాం.

నవచైనా గురించి తెలుసుకోదలచినవాళ్లు హాంకాంగ్‌ను గురించి కొంచెం తెలుసుకోవాలి. ఇదికూడా చారిత్రకంగానూ, భౌగోళికంగానూ చైనాకు సంబంధించిన ప్రదేశం. చైనాలో యిది ఒక భాగం. అయినా నేడిది చైనాతో సంబంధం లేకుండా వుంది. స్వతంత్ర చైనాప్రక్కన యిదొక మాయలోకంగా యేర్పడింది. ఉనికిలో, ఉచ్చారణలో, ఆశయాలలో, జీవితాన్ని అవగాహన చేసుకోవడంలో, ఆర్థిక విధానంలో, ఆచార వ్యవహారాలలో, విజ్ఞానంలో, నాగరికతలో అనేక వ్యత్యాసాలు కనిపిస్తుంటాయి. స్వతంత్ర చైనా ప్రజలకూ, హాంకాంగ్ ప్రజలకూ వుండే తార

తమ్యాలు సాంఘికంగానే కాకుండా రాజకీయంగా మరీ నిస్పష్టంగా కనబడుతుంటాయి. నవచైనా ప్రజలు స్వతంత్ర వాయువులు పీలుస్తూ సర్వ సమానత్వంతోను, భ్రాతృత్వంతోను వ్యవహరిస్తూవుంటే, వీరు బ్రిటిష్ సామ్రాజ్య తత్వంక్రింద బానిసత్వంలో మ్రగ్గుతున్నారు.

చైనా విప్లవంలో తమ రాక్షసవిధానం తుడిచిపెట్టుకు పోతూంటే తమ సంపదల్ని తరలించుకొని వచ్చిన బ్యాంకర్లు, పెట్టుబడిదారులు, భూస్వాములు మొదలైన నిరంకుశ విధానాన లంబకులు ఇక్కడ బ్రిటిష్ పతాకంక్రింద తల దాచుకొంటున్నారు. చాంగ్-కై-షేక్ నియంతృత్వంలో సర్వాధికారాలు అనుభవించి, అనేకమంది దేశభక్తుల్ని హతమార్చి, అనేకమంది యువతుల, మెడలకు ఉరిత్రాళ్ళు కట్టి నానాబీభత్సాలు కల్పించిన ప్రభుత్వ ఉన్నతోద్యోగు లెందరో పార్మోజా (తైవాన్), హాంకాంగ్‌ల మధ్య తిరుగుతూ, చాంగ్‌కైషేక్ కుతంత్రాల్ని కార్యరూపంలో పెట్టడానికి యత్నించేవాళ్లెందరో ఇక్కడకు వస్తూపోతూ ఉంటారు. వీరికితోడు చైనా దేశంలో తమ పెట్టుబడులమీద ప్రతిసంవత్సరం మూడింతలు నాలుగింతలు లాభాలు పొంది, కార్మికవర్గాన్ని యంత్రంలోపెట్టి గాను గాడినట్లు వాళ్ళ రక్తాన్ని, చెమటను పిండి వాళ్ళయెముకల్ని చూర్ణంచేసిన ప్రబుద్ధులు. చైనాప్రజలమానాన్ని ధనాన్ని విరివిగా కొల్లగొట్టిన అంతర్జాతీయ పెట్టుబడిదారుల గుంపంతా చైనా స్వతంత్రం పొందగానే కోట్లకొలది ధనంతో ఉడాయించి ఇక్కడ స్థావరం ఏర్పరచుకున్నారు. చైనాదేశపు ఆర్థిక దుస్థితికి, అవమానాలకు, అవినీతికి కారకులైన సామ్రాజ్యవాదుల ఆటబొమ్మలెన్నో ఇక్కడ తెరమీద నృత్యం చేస్తూవుంటాయి. వీళ్ళతోపాటు కొందరు ఇతరదేశాల వ్యాపారులుకూడ వున్నారు. వీరందరికి బ్రిటిష్ పతాకం తన నీడక్రింద సంరక్షణ యిస్తూంది.

చైనాదేశపు పొలిమేరైనా ఈదేశానికీ, అసలుచైనాకూగల తారతమ్యం తెలపడానికి మాస్వంత అనుభవం ఒకటి తెలియ పరుస్తా.

మేముండిన కౌలూన్ హోటలు రాచమార్గంలోవుంది ఇందులో నానాదేశాలనుంచి వచ్చేవాళ్ళందరూ దిగుతూవుంటారు. ఇందులో విదేశీయుల కులాసాకోసం నృత్యంలో పాల్గొనడానికి చైనా యువతులు చాలచౌకగా దొరుకుతూ వుంటారు. ఇక్కడి చైనా స్త్రీలనుచూచి అసలు చైనా స్త్రీల ప్రవర్తనను నిర్దేశించ డానికి వీలులేదు.

ఇక్కడ స్త్రీలు పురుషులను ఆకర్షించడానికెన్నో వేషాలు వేస్తారు. కనుబొమలు కత్తిరించుకోడం, పంట్లూడ గొట్టుకొని దొంగపళ్లు పెట్టుకోడం, బుగ్గలకి – పెదవులకి – మొగాలకి బైరాగి రంగులు పూసుకోవడం, సగం శరీరం అగుపడేటట్లు దుస్తులు ధరిం చడం ఇవన్నీ యిక్కడ గోచరిస్తాయి.

నాతోటి ప్రతినిధి శరణ్ రాత్రిపదిగంటలకు హాంకాంగ్‌లో షికారుకు వెళ్ళాడు. పోయేటప్పుడు, భాష, ఆచార వ్యవహారాలు తెలియని ప్రదేశంలో తోడులేకుండా వెళ్ళడం మంచిదికాదని హెచ్చరించాను. అయినా అతడు వెళ్ళాడు. వెళ్ళినందుకు తగిన శాస్తి పొంది వచ్చాడు. అతడు రోడ్డుమీద పోతూంటే కొందరు రౌడీలు చుట్టుముట్టారు. ఒక డాతని చేయిపట్టుకొని "చక్కని చిన్నది కావాలా! నడూ!" అని లాగడం మొదలుపెట్టాడు. అతడు కంగారుతో తప్పించుకోడానికి యత్నం చేస్తూంటే, ఇంకొకడు రెండోచేయిపట్టుకున్నాడు. మూడోవాడు జేబులోపలి పర్సు, ఫౌంటెన్‌పెన్ రెండూ లాక్కున్నాడు. ఇతడు గోలచేయడం మొదలు పెట్టాడు. ఇంతలో అదృష్టం బాగుండి కొంచెం దూరంలో పోలీసు సార్జెంటు కనబడ్డంవల్ల వాళ్ళు పెన్, పర్సు రోడ్డుమీద పడేసి పారి పోయారు. శరణ్ ఆ రెండూ అందుకొని హోటలుకు వచ్చి ఈ కథ చెప్పాడు.

హాంకాంగ్‌లో యిటువంటివి ఎన్నో బాహాటంగా జరిగిపోతూ వుంటాయి.

## 2

# భారత ప్రజలతో చైనీయుల ఆత్మీయత

ఏప్రిల్ 25 వ తేదీ సాయంత్రం కాంటన్ పట్టణం చేరాము. చైనాలోవుండే అయిదారు ముఖ్యపట్టణాలలో యిదొకటి. ఇది క్వాంటన్ రాష్ట్రానికి ముఖ్యపట్టణం కూడా. చాంగ్ కై షేక్ ప్రజాశక్తుల విజయంముందు నిలువలేక పారిపోతూ, తన రాజధానిని నాంకింగ్‌నుంచి ఒక్కొక్క పట్టణానికే మార్చుతూవచ్చాడు. అట్టి మార్పులలో కడపటిది కాంటన్. కొంతకాలం యిది జపాన్ పరి పాలనకుకూడ లొంగింది.

ఈపట్టణం జనసంఖ్య 14 లక్షలు. ఇది చూడడానికి కల కత్తా పట్టణంలాగుంటుంది. హుగ్లీనది కిరుప్రక్కలవలె పెరల్‌నదికి రెండువైపులా ఈ పట్టణం వ్యాపించివుంది. మేమీపట్టణం చేరేటప్పటికి కొద్దిగా వర్షం కురుస్తోంది. రైల్వేస్టేషన్‌లో అనేకమంది కార్మికులు, స్త్రీ పురుషులు, నాయకులు స్వాగతమీయడానికి యెదురు చూస్తున్నారు. నా వెంట సియాబిహారీ శరణ్ కూడా వున్నాడు. మేము దిగగానే కొంతమంది స్త్రీలు పూలగుత్తులతో వచ్చి వాటిని మా కిచ్చారు. "హాపిన్ వాన్-సే" అనే నినాదాలతో మమ్ము కారువరకు తీసుకొనివెళ్ళారు. "హాపిన్-వాన్-సే" అనే మాటల అర్థమేమో అప్పుడు మాకు తెలియలేదు. తరువాత "ప్రపంచ శాంతి చిరస్థాయి అగుగాక!"అని అర్థమని తెలిసింది. చైనా దేశంలో మనలాగు పూలమాలలు వేయరు. పూల గుత్తులను

చేతికిస్తారు. మమ్మల్ని నాహ్వానించడానికొచ్చిన ఒక సోదరి తన ఓవర్‌కోటు నామీద కప్పింది. నేనామెకు కృతజ్ఞత తెలిపి దాన్ని నిరాకరించాను. ఆమె ఊరుకోలేదు. బలవంతంగా నా మీద కప్పింది. "నేను కాయకష్టానికి, ఎండవానలకు అలవాటు పడినవాడిని. మీరు నాకంటె సౌకుమార్యం కలవాళ్లు" అని ఆ ఓవర్‌కోటు ఆమెమీద వేశాను. ఆమె మళ్ళీ బలవంతంగా దాన్ని నామీదకప్పి "మీరు మా అతిధులు. మీ కన్నివిధము లైన సౌకర్యాలు కూర్చడం మా కర్తవ్యం" అని చెప్పింది. ఆమె సుహృద్భావం యెన్నడూ మరపురాని విషయం.

కాంటన్‌లోని గొప్ప హోటలులో మాకు వసతి యేర్పా టయింది. ఈ హోటల్ పేరు ఐ – చే. ఇది 13, 14 అంతస్తుల భవనం. పెరల్ నదీ తీరంలో కట్టబడింది. నాగది కిటికీలనుంచి పెరల్ నదిలోని స్టీమర్లు, చిన్న చిన్న ఓడలు, పడవలు అన్నీ అగపడుతూ వుంటాయి. సాయంత్రం కాగానే నదిమీదంతా వేలకొలది దీపా లగుపడుతూఉంటాయి. ఈ దృశ్యం నేత్రపర్వంగా వుంటుంది. మమ్మలను పెకింగ్‌కు తోడ్కొని పోవడానికి అఖిలచైనా ట్రేడ్ యూనియన్ల ఫెడరేషన్‌నుంచి ముఖ్యనాయకులలో ఒకరయిన షా – నీ – ఫంగ్ కాంటన్ పట్టణానికి వచ్చాడు. మేము చైనాలో ఉన్నంతకాలం భారత కార్మిక ప్రతినిధు లందరినీ కనిపెట్టి వారికి యేలోపాలూ లేకుండా వలసిన సౌకర్యాలొనర్చడాని కీయన బాధ్యుడు. ఇతనితో పరిచయం కలిగిన ఒకటి రెండు రోజులలో నేనూ ఇతనూ గొప్ప స్నేహితుల మయ్యాం. మా యిరువురం చిన్న తనంలో ఒకేవిధమైన కష్టాలు అనుభవించాం. జీవితం గడపడం కోసరం హోరాహోరీగా పోరాడడమూ, అతి ప్రయాసతో కాలం గడవడమూ, బీదరికంతో దయతలచేవాళ్లెవరూ లేని పరిస్థితుల్లో స్వీయకష్టంపైన ఆత్మవిశ్వాసంపైన ఆధారపడి ప్రతిదినం రొట్టె కోసరం కాళ్ళుచేతులు విరిగేటట్లు చాకిరీచేయడం యివన్నీ మేమిరువురమూ అనుభవించిన కష్టాలు. మా చరిత్రలు ఒకరినొకరు

చెప్పుకోడంతో మా కిద్దరికీ సన్నిహితమైన సంబంధం ఏర్పడింది. షా-నీ-ఫంగ్ వయసులో నాకంటె చిన్నవాడయినా, నేను చైనాలో వున్నంతకాలమూ నన్నతడు అన్నవలె ఆదరించి కనిపెట్టి వుండేవాడు. మా యిరువురి స్వభావాలుకూడ యించుమించు ఒకటే విధంగా వుండడంవల్ల మేము ప్రాణస్నేహితుల మయ్యాం.

కాంటన్‌లో మాకంటె ఒకటిరెండు రోజులు ముందువచ్చిన బినయ్‌రాయ్‌తో నాకు పరిచయం కలిగింది. ఈయన ఆల్ ఇండియా బాంకింగ్ ఎంప్లాయీస్ ఫెడరేషన్ అధ్యక్షుడు. పాట్నాలో "ఇండియన్ నేషన్" అనే ఆంగ్ల దినపత్రికకొకప్పుడు సంపాదకుడు. ప్రస్తుతం ఆ పత్రిక ముఖ్యవ్యాస కర్తలలో ఒకడు.

ఆ రాత్రి మేమందరమూ సినిమాకి వెళ్ళాం. అది మంగోలియన్ చిత్రం. మాకు భాష యేమాత్రమూ అర్థంకాదు. సోదరి యూ-మి-మింగ్ నా ప్రక్కన కూర్చొని మధ్యమధ్య యింగ్లీషులో సంభాషణలు చెప్తూండేది. భాష తెలియకపోయినా కథ అర్థమయ్యేటట్లుంది. దృశ్యాలు, సన్నివేశాలు, సంగీతం, నటన, ఇవన్నీ భారత చలన చిత్రంలాగే తోచాయి. కొమింటాంగ్ పాలనలో రైతులు, గొఱ్ఱెల కాపర్లు పడినపాట్లు, గడ్డి, నీళ్లులేక మైళ్ళకొలదిగా తిరుగుతూ స్థావరాల కోసరం పడినపాట్లు, చైనా విముక్తి చెందిన తరువాత సమిష్టి సంఘాలద్వారా ప్రజలలో చైతన్యం కలిగించి వాళ్ళ పూర్వస్థితిని బాగుచేయడానికి నూతన ప్రభుత్వం వారి సుస్థిరనివాసానికి తగిన వసతులు కల్పించడం, గడ్డికి నీటికి లోపంలేకుండావుండే విధానాల ననుసరించడం, వాళ్ళ జీవితాలు శాంతంగాను, సౌఖ్యంగాను గడవడాని కవసరమైన పరిస్థితులను కల్పించడం-యివన్నీ ఆ చిత్రంలో ప్రదర్శించబడ్డాయి. గొర్రెలను రోగాలనుంచి కాపాడడము, వాటి ఆరోగ్యం విషయంలో అవలంబించవలసిన విధానము, ఉన్నిని సేకరించి దాన్ని సద్వినియోగంచేసే కార్యక్రమం—యివన్నీకూడా ఆ చిత్రం

సూచించింది. దాన్ని చూచినంతసేపు మన దేశంలోని దృశ్యా లెన్నో తలపుకువచ్చాయి.

రెండోరోజు 72 మంది దేశభక్తుల సమాధిని చూచాము. దీనిపేరు "హాంగ్-హా-కాంగ్". అంటే పచ్చపూల పర్వతం అన్నమాట. 1911 విప్లవంలో చింగ్ రాజవంశాని కెదురుతిరిగి ప్రజాస్వామ్యం కోసం విప్లవం లేవదీసినవారిలో 72 మంది నాయకులు ఉరితీయబడి ఒకే గుంటలో పూడ్చి పెట్టబడ్డారు. ఆ ప్రదేశంలో వారి స్మృతిచిహ్నంగా యీ సమాధి నిర్మించ బడింది. 72 మంది వీరుల పేరులు రాతిపలకలమీద చెక్కబడి స్థాపింపబడివున్నాయి.

చైనాలో విప్లవజ్వాలలను రగుల్కొల్పి, చక్రవర్తుల దుష్పరి పాలన నంతమొందించి ప్రథమ ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పిన చంగ్-షాన్ (సన్-యత్-సేన్) గౌరవార్థం నిర్మింపబడ్డ ఒక విశాల భవనం కాంటన్‌లో వుంది. ఇది 1911 విప్లవానంతరం 1929 – 31 మధ్య నిర్మింపబడింది. దీనికి యించుమించు ఢిల్లీ పార్లమెంటు భవనాని కున్నంత గుమ్మటం వుంది. అయిదువేల జనం కూర్చునే టందుకు తగిన స్థలం, కుర్చీలు వున్నాయి. ఈ భవనానికి బయట "టీన్-సియా-వై-కుంగ్"అని చైనా లిపిలో సన్-యత్-సేన్ స్వహ స్తంతో వ్రాసిన అక్షరాలు చెక్కబడివున్నాయి. "టీన్-సియా-వై-కుంగ్"అనే వాక్యానికిఅర్థం 'ప్రపంచంలోని మానవులంతాఒకటే' అనివిన్నాను. ఈ మహాభవనం చైనా శిల్ప సౌందర్యానికి మకుటం. శ్రీమతి విజయలక్ష్మి నాయకత్వంక్రింద వెళ్ళిన భారత సాంస్కృతిక రాయబారవర్గం యీ భవనంలో ఒక ప్రదర్శనం యిచ్చారని విన్నాం.

చైనా విముక్తినొందిన తరువాత, కాంటన్‌లో ఒక గొప్ప క్రీడాస్థలం నిర్మింపబడింది. 45 వేల జనం కూర్చోడానికి గ్యాలరీలు నిర్మింపబడ్డాయి. ఈ ప్రదేశంలో వివిధక్రీడా విన్యాసాలు జరుగుతూ వుంటాయి. కాంటన్‌లోని విద్యార్థులను తీరిక సమయంలోను,

కొమింటాంగ్ పాలనలో నిరుద్యోగానికి పాల్పడి నగరంలో బిచ్చం యెత్తుకుంటూన్న వారందరినీ నియోగించి దీన్ని నిర్మించారని విన్నాము. ఈ విధానంవల్ల కాంటన్‌లో బిచ్చమెత్తే విధానానికి స్వస్తి చెప్పబడింది. వాళ్ళందరూ ప్రస్తుతం యేదో ఒక వృత్తిలో నియోగింపబడ్డారు. బ్రహ్మాండమైన యీ క్రీడాస్థలం సమష్టినా నిర్మాణశక్తికి ఒక తార్కాణం.

తరువాత కాంటన్ నగరంలోని కార్మికసంస్థల్ని దర్శించాము. మునిసిపల్ ట్రేడ్ యూనియన్ కౌన్సిలు మాకు గొప్ప స్వాగతం యిచ్చింది. ఈ సంస్థ పదెనిమిది అంతస్థుల విశాల భవనంలో వుంది. ఒక గొప్ప ప్రభుత్వశాఖవలె ఇక్కడ కార్యకలాపం సాగుతూ వుంటుంది. కార్మికవర్గంయొక్క ఆర్థిక, సైనిక పురోభివృద్ధి కోసరం యెన్నో ప్రణాళికలున్నాయి. వాటిని ఆచరణలో పెట్టే బాధ్యత కార్మిక నాయకులదే. కార్మికవర్గంయొక్క రక్షణకోసరం భీమా, జబ్బు పడినప్పుడు ఉపాధికీ చికిత్సకూ తగిన కట్టుదిట్టాలు, వారి ఆరోగ్యం విషయంలో తగిన శ్రద్ధ, పిల్లలకు విద్యాసౌకర్యం మొదలయినవన్నీ ట్రేడ్ యూనియన్ లే నిర్వహిస్తాయి. కార్మికుల చికిత్సకోసరం ఆస్పత్రులు, ఆరోగ్యప్రదేశాలు, ప్రసూతి మందిరాలు, నర్సరీలు (పిల్లలను పోషించడానికి నిర్మింపబడిన సంస్థలు) ఇవన్నీ ట్రేడ్ యూనియన్ కౌన్సిళ్లే నిర్వహించడానికి పూనుకుంటాయి.

యూనియన్ భవనంలోని విశాలమైన గదులలో స్త్రీపురుష కార్మికులు, కార్మిక నాయకులు, టేబుల్స్‌ముందు కూర్చొని తీవ్రంగా ఆలోచిస్తూ చర్చిస్తున్నారు. తమ సౌఖ్యంకోసరం, ఇతర కార్మికుల సౌఖ్యంకోసరం వారు వహించే శ్రద్ధను ఆ దృశ్యం కనపరచింది.

చైనా కార్మికసంస్థలు మన కార్మిక సంస్థలలాగ ఆర్థిక నిస్సహాయతతో కృశించిపోకుండా సుస్థిర పునాదులపై నిర్మింపబడ్డాయి. ప్రతి కార్మికుడు తన వేతనంలో నూటికొకపాలు ప్రతి

నెలా చందా చెల్లిస్తాడు. పరిశ్రమ వరబడినుండి అంతకురెండింతలు, ప్రభుత్వంనుంచి మూడింతలూ చెల్లించబడుతుంది. సంవత్సరంలో ప్రతి కార్మికుడి నెలజీతంలో నూటికి 72 పాళ్లు యూనియన్‌కి వర బడిగావస్తుంది. ఈ వరబడిలో నూటికి 70 పాళ్లు రాష్ట్రీయ ట్రేడ్ యూనియన్ కౌన్సిళ్లు తమ ఖర్చులకోసరం ప్రత్యేకించుకొని, మిగిలినది కేంద్రసంస్థలకు చెల్లిస్తారు. ఈ ట్రేడ్‌యూనియన్‌లలో యెన్నో వందలమంది వివిధ శాఖలలో పనిచేస్తారు. వాళ్ళందరికీ పరిశ్రమలలోవలెనే వేతనాలు, యితర సౌకర్యాలు యేర్పరుప బడ్డాయి. కేంద్రసంస్థలు కార్మికుల శ్రేయస్సుకోసరము, వాళ్ళ సంరక్షణకోసరము తమకువచ్చే ఆదాయాన్ని వినియోగిస్తారు.

చైనాలో జీవన వ్యయప్రమాణాన్ని అనుసరించి కార్మికుల వేతనాలు యేర్పడుతాయి. ప్రతి కార్మికుడికి కనీసవేతనం నిర్దేశించబడి, అంతకుతక్కువ లేకుండా అతడికి వేతనం లభి స్తుంది. వివిధరకాల వృత్తులవారికి వారివారి పనిని, బాధ్య తనుబట్టి జీతాలు నిర్ణయించబడుతాయి. వీటికితోడు ఓవర్‌టైమ్ (అదనపుగంటలు) అలవెన్సులు, పీస్‌వర్క్ (కంట్రాక్టు కూలీ) బోనసులుకూడ లభిస్తాయి. అంటే కార్మికుడెంతపనిచేయగలిగితే అంత యెక్కువ సంపాదించ గలుగుతాడు.

చైనా విముక్తికి ముందు కార్మికుని వేతన ప్రమాణం 90 యూనిట్లుంటే స్వతంత్రచైనాలో అది 140 యూనిట్ల వరకు పెరి గింది. పరిశ్రమలలో వారానికి 48 గంటలు పనిచేస్తారు. వారంలో ఒకరోజు తప్పకుండా విశ్రాంతి లభిస్తుంది. కొన్ని పరిశ్రమలలో ఫ్యాక్టరీ డైరెక్టరుకంటె మంచి పనితనంగల కార్మికుడు యెక్కువ సంపాదించుకునే అవకాశంవుంది. ఇది ఆశ్చర్యకరమైన విషయం. ఈవిధంగా విముక్తచైనాలో కార్మికవర్గం నూతనోత్సాహంతో, దివ్యమైన ఆదర్శంతో ముందుకు నడుస్తూంది. ఒకప్పుడు దాసాను దాసులుగా పడివున్న కార్మికులు నేడు వర్గచైతన్యంతో, స్వాభి

మానంతో, ఆత్మగౌరవంతో, విశ్వాసంతో జీవితం గడుపుతు న్నారు.

కాంటన్ పట్టణం ఒక స్వర్గంగా మారిపోయిందని చెప్పడం నా అభిప్రాయంకాదు. అక్కడ బీదరికము, అమాయకత్వము, అజ్ఞానము కూడవున్నాయి. పెద్దపెద్ద భవనాలమరుగులో పూరిగుడి సెలు, చీకటికొంపలుకూడ వుంటాయి. అయితే వీటిని విదేశ ప్రతినిధుల దృష్టి పథంనుంచి తప్పించడానికియత్నంచేయరు. వీటిని రూపుమాపడానికి ప్రజాప్రభుత్వం కృషిచేస్తూంది. అక్కడ మన దేశంలోలాగే చెమటకారుతూ రిక్షాలనుతొక్కే కూలిజనం ఉన్నారు. పశువులకుబదులు తామే బండ్లనీడ్చుకొనిపోయే మను ష్యులూ వున్నారు. కాని మునుపటికీ యిప్పటికీ తేడాయేమంటే, ఇదివరకు భవిష్యత్తుపై విశ్వాసంలేక నలిగి నలిగి జీవితాలను నాశనం చేసుకొనేవారు. ఇప్పుడు తమ చుట్టుపట్లజరిగే అభివృద్ధినీ మార్పునూచూచి భవిష్యత్తుపై అచంచల విశ్వాసంతో తమ జీవి తాలను మార్చుకుందుకు యత్నంచేస్తున్నారు. రోడ్లపైన పనిచే స్తున్న కూలీలలో అందరికంటె అమాయకంగాను, అజ్ఞానంతోను అగుపించే ఒకనినిచూచి, ఇప్పటికీ మునుపటిక భేదమేమని నేనుప్రశ్నిం చాను. "అప్పుడు మేమందరం పశువులం, యిప్పుడు మనుష్యులం" అని అతడు జవాబిచ్చాడు. "మీరింకా అమాయకత్వంనుంచీ, బీద రికంనుంచీ విముక్తి పొందలేదే" అని అడిగితే, "ఇదివరకు యెంత చాకిరీచేసినాతిండికి బదులుతన్నులు దొరికేవి. ఇప్పుడు తిండికి, బట్టకు లోపంలేదని" జవాబిచ్చాడింకొకవ్యక్తి. "మునుపు మాకుఆస్పత్రుల లోకి, పార్కులలోకి పోవడానికి హక్కులేదు. నేడు అందరితో సమానంగా తలెత్తుకుని తిరిగే అవకాశం కలిగింది" అన్నారు తక్కిన కూలీలు. కాంటన్ పట్టణంలో నేను ముఖ్యంగా గమనించిన విషయం అక్కడ వంటిమీద బట్టలేని మనిషీ, బిచ్చమెత్తే మనిషీ గోచరించలేదు.

కాంటన్‌నుంచి నవచైనా రాజధానీ నగరం పెకింగ్ 15 వందలమైళ్ళ దూరంలోవుంది. రైలు ప్రయాణం తప్ప వేరే సౌకర్యంలేదు. చైనాలో విమానాల సర్వీసు పెకింగ్‌నుంచి మాస్కోకు తప్ప యితర ప్రదేశాలకులేదు. ఈ రైలు ప్రయాణం యించుమించు రెండున్నర రోజులు పడుతుంది. రైలుమార్గం వివిధ రాష్ట్రాల మధ్యనుంచి పోతుంది. దారిలో ప్రకృతి రమణీయమైన దృశ్యాలు, పంటపొలాలు, పల్లెటూళ్లు, నదులు, వాగులు, చెరువులు, పర్వతాలు ఎన్నో గోచరిస్తాయి. మనదేశంలో లాగే రైలుమార్గాని కిరుప్రైవులా కృషీవలులు తమ పొలాలలో పనిచేస్తూ వుండడం గోచరిస్తుంది. వాననుండి శరీరాన్ని కాపాడుకోడానికి మన దేశంలో జమ్ముతో చేసిన కోటువంటిదాన్ని ధరిస్తారు. చైనాలో వ్యవసాయ పశుసంపద తక్కువగా వున్నట్లు గోచరిస్తుంది. గాడిదలను, గుఱ్ఱాలను, బఱ్ఱెలను దున్నడానికీ, నీళ్లుతోడడానికీ ఉపయోగిస్తారు. దారిపొడుగునా ఈ దృశ్యాలగుపడుతూవుంటాయి. కొన్ని ప్రదేశాలలో మనుష్యులే నాగలి గుంజడంకూడ చూచాము. కాని, యిది ఎక్కడో ఒక ప్రదేశంలో అరుదుగా అగపడే దృశ్యం. పొలాలలో స్త్రీలు, పిల్లలు కూడ పురుషులకు సాయం చేస్తూ వుంటారు. దారిలోని పల్లెటూళ్ళు మనదేశంలోని పల్లెటూళ్ళ వలెనే ఉంటాయి. కొన్ని ఊళ్లకి చుట్టూ రాతి గోడలు వున్నాయి. భద్రతకోసరం పాతకాలంలో కట్టబడ్డ చిన్న చిన్న కోటలవలె అవి గోచరిస్తాయి. కాంటన్‌నుంచి పెకింగ్‌కు గల 15 వందల మైళ్ళ దూరంలో సాగుబడిచేయని ప్రదేశం ఒక్క అంగుళమైనా కనిపించదు. కొండలమీదకూడ సమతలాల నేర్పరచి వ్యవసాయం కొనసాగిస్తున్నారు. బావులనుంచి నీరుత్రోడి పొలాలకు కట్టడంకూడ అగుపిస్తుంది. ఇలా నీళ్లుతోడే గానుగలకి సహజంగా గాడిదలనే ఉపయోగిస్తారు. దారిలో కొన్ని పల్లెటూళ్లలో కొండలలో గుహలను తొలచి వాటికి తలుపులను ఏర్పరచుకొని నివసిస్తూండడంకూడ చూచాము. ఈదృశ్యం అనేకవేల సంవత్స

రాల క్రిందటి నాగరికతను స్మృతికి తెస్తుంది. దారిపొడుగునా మేము చూచిన పల్లెటూళ్లలో ప్రజలు భాగ్యవంతులుగా కాకపోయినా, అపరిమితమైన దారిద్ర్యం అనుభవించేవాళ్లలా గోచరించలేదు. ప్రతిస్త్రీ, పురుషుడు, ఒంటినిండా బట్టతో గోచరిస్తారు.

కాంటన్‌కి, పెకింగ్‌కిమధ్య హాంకౌ పట్టణంవుంది. ఇదికూడ ఒకప్పుడు చాంగ్-కై-షేక్ పారిపోవడంతో రాజధానిగా కొద్దిదినాలుండింది. హాంకౌకూడ ఒక రాష్ట్రానికి ముఖ్యపట్టణం. ఇక్కడ రైలు దిగి ఊరిమధ్యవుండే పెరల్‌నదిని పడవమీాదదాటి రెండో వైపు మళ్ళీ రైలెక్కాలి. ఈ నదికి రైల్వేబ్రిడ్జిలేదు. ఇప్పుడు కట్టడం ప్రారంభించారు. కొన్ని నెలలలో పూర్తి కావచ్చు. హాంకౌకి కొంతదూరంలో ఒక గొప్ప కాసారము, మంచి వసతి భవనము, యూనివర్సిటీ భవనాలు ఉన్నాయి. ఇక్కడ యూనివర్సిటీలోని స్త్రీ పురుష విద్యార్థులు చాంగ్‌కై-షేక్ ప్రభుత్వాన్నెదిరించి ప్రజాయుద్ధానికి సానుభూతి వహించినందుకు కొమింటాంగ్ సైనికుల దౌర్జన్యానికి గురి అయ్యారు.

మేమీా 15 వందలమైళ్లు రైలులో ప్రయాణంచేసి, 29 వ తేదీ రాత్రి రెండుగంటలకు పెకింగ్ చేరాము. దారిలో మధ్య మధ్య మాకు కార్మిక నాయకులు, కార్మికులు స్వాగతాలిచ్చారు. పెకింగ్ స్టేషన్‌లో మాకు బ్రహ్మాండమైన స్వాగతం యేర్పాటు చేయబడింది. వర్షం కురుస్తూన్నా వేలకొలది కార్మికులు, స్త్రీ పురుషులు ఆ అర్థరాత్రి పూలగుత్తులతో మమ్మాహ్వానించడానికి ఎదురు చూస్తున్నారు. అఖిలచైనా ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ కార్యదర్శి లీ-చీ-పో, రైల్వేకార్మికుల పక్షాన నన్నాహ్వానించాడు. వందలకొలది స్త్రీ పురుషులు కరస్పర్శచేస్తూ పూలగుత్తులందించారు. వాళ్ళఉత్సాహము, ప్రేమ చూస్తే నేను వేరేదేశంలో విదేశ వ్యక్తులమధ్య వున్నట్లే తోచలేదు. అంతా ఒకే కుటుంబానికి చెందినవాళ్ళవలె తోచింది. ఇదివరకు ఒకరితో ఒకరికి పరిచయం లేకపోయినా, ఒకరి పేరొకరు వినకపోయినా మాపై

ఇంతప్రేమ, అభిమానం చూపడానికి కారణం చైనా కార్మికవర్గం యొక్క అంతర్జాతీయ దృక్పథమేనని తేటతెల్లం చేస్తుంది. అంతే గాక భారతదేశంపట్ల, భారతీయులపట్ల చైనా ప్రజలకెంతో గౌరవమూ, అభిమానమూ వున్నాయి. పండిత నెహ్రూయొక్క రాజనీతి, ఆయన చైనాపట్ల చూపిన గౌరవం, ప్రేమ, నవచైనాను ప్రప్రథమంగా గుర్తించడం, చైనాపట్ల మిత్రత్వం ప్రకటించడం, ఐక్యరాజ్యసమితి సమావేశాలలో నవచైనాపట్ల భారతదేశం వహించే నైఖరీ, కొరియాలో ఇండో - చైనాలో శాంతి స్థాపనకు భారత ప్రభుత్వమూ పండితనెహ్రూ చేసిన తీవ్రకృషి యివన్నీ విముక్త చైనానూ స్వతంత్ర భారతదేశాన్నీ ధృఢమైన స్నేహ పాశాలతో బంధించినాయి.

పండిత నెహ్రూ ప్రతిష్ట చైనాలో చాల హెచ్చుగావుంది. ఆయన ప్రపంచ శాంతికోసరం యెంత త్యాగమైనా చేస్తాడని, భారతదేశం సామ్రాజ్యవాదుల, యుద్ధ పిపాసుల రాజకీయ వలలో చిక్కుపడకుండా ప్రజాస్వామ్యాన్ని ఇతర దేశాల స్వాతంత్ర్యాన్ని బలపరచే విధానాన్ని అనుసరిస్తున్నాడని ఆయనపట్ల చైనాప్రజలు సంపూర్ణ సుహృద్భావం చూపుతున్నారు. టిబెట్టు విషయంలో చైనా-భారత దేశాలమధ్య జరిగిన ఒడంబడికవల్ల ఈ రెండు ప్రాచీన మహోత్కృష్ట దేశాలమధ్య స్నేహ బాంధవ్యం యింకా దృఢతర మైంది.

ఇంతే కాకుండా, ప్రాచీనకాలంనుంచీ భారతదేశం, చైనా దేశం కళలలోను, విజ్ఞానంలోను, నాగరికతలోను, మతం లోను పరస్పరం పొందిన సహాయము కలయిక కూడ భారత దేశాన్ని చైనాకు సన్నిహితం చేశాయి.

పెకింగ్ పీస్ హోటలులో అంతర్జాతీయ కార్మిక ప్రతినిధు లతోపాటు మాకు బసలేర్పాటు చేయబడ్డాయి. పీస్ హోటలు ఎనిమిది తొమ్మిది అంతస్తుల మహాభవనం. ఇందులో యించు మించు 800 గదులున్నాయి. ఇంత విశాల భవనాన్ని నవచైనా

కార్మికులు మూడు నెలలలో నిర్మించారు. ఇదివాళ్ల నిర్మాణ శక్తికి, ఉత్సాహానికి తార్కాణం.

ఏప్రిల్ 30 వ తేదీ ప్రాతఃకాలం మేము భారతరాయబారి కార్యాలయానికి వెళ్ళాము. అక్కడ భారతకాన్సల్ శ్రీ గోవర్థన్ మమ్మ పరామర్శించారు. సెక్రటరీ శ్రీ చందాతో పరిచయం కలిగింది. వీరికి మమ్ములను చూడగానే ఎంతో సంతోషం కలిగింది. ఎప్పుడో ఒకప్పుడుగాని భారతీయుల ముఖాలే వీరి కగపడవు. ఈఅధికారులంతా మమ్ములనుయెంతో గౌరవంగా చూచారు. ఒకటి రెండుసారులు వీరింటికి మేమతిథులంకూడ అయ్యాము. గోవర్థన్‌గారిభార్య కమలాదేవి, చందాగారిసతీమణి మాకొసగిన ఆతిథ్యం వాత్సల్యపూర్వకమైనది. తర్వాత మాకిక్కడ శ్రీ పరంజపే భారతరాయబార కార్యాలయంలోని ముఖ్యోద్యోగితో పరిచయంకలిగింది. ఈయన అవివాహితుడు. చాల కలుపుగోరుతనం కలవాడు. చైనాభాష వ్రాయడంలోను, మాటలాడటంలోను యితడు మంచి ప్రజ్ఞకలవాడు.

మాకు పెకింగ్‌లో భారతదేశానికి, చైనాకూమధ్య టిబెట్టుపై జరిగిన ఒడంబడికను గురించి తెలిసింది. పెకింగ్ నాయకులలో ఆ దినంచాలా సంతోషము, ఉత్సాహము వెల్లివిరిసాయి. మమ్ములను చూడగానే కౌగలించుకొని పరామర్శచేశారు. ఆ దినం సాయంత్రం పెకింగ్ హోటలులో అంతర్జాతీయ కార్మిక నాయకులందరికీ విందు జరిగింది. శ్రీ శిబన్‌లాల్ సక్సేనా, సిసిర్ రాయ్, పి. వి. జోషి, కాంటన్‌నుంచి ప్రత్యేక విమానంలో నాటి సాయంత్రమే పెకింగ్ చేరారు. వీరి పరిచయం నాకు పెకింగ్ హోటలు బాంక్వేటులో జరిగింది. మొట్టమొదట సోవియటు కార్మిక ప్రతినిధుల నాయకుడు క్రిజ్జనినవ్ ఆహ్వానానికి ప్రత్యుత్తరం యిస్తూ చైనా కార్మిక వర్గానికి అభినందనలు తెలిపాడు. తరువాత సక్సేనా మాటలాడాడు. ప్రతిదేశంయొక్క కార్మిక ప్రతినిధి వర్గానికి నాయకుడుఅంటూ ఒకడుండటము, శక్తి నవారందరు అతని ఆదేశం

ప్రకారం నడవటము జరుగుతూ వుంటుంది. కాని భారతదేశ ప్రతినిధులకి నాయకత్వపు గొడవలేదు. ప్రతివ్యక్తీ నాయకుడే సర్వతంత్ర సంతంత్రుడే! దీనికి కారణం మన దేశనుంచి వెళ్ళే ప్రతినిధులు వివిధ కేంద్ర సంస్థలకు, వివిధ రాజకీయ పక్షాలకు చెందివుండి ఒకరి ఆధిపత్యాన్ని యింకొకరు సహించకపోవడం. మన దేశంలో యే విధంగా వర్తించినా విదేశాలలో నయినా ఏకంగా వర్తించడానికికూడ వారు పూనుకోవడంలేదు.

సక్సేనా తరువాత నేనే భారత కార్మికవర్గంయొక్క శుభాకాంక్షలను తెలుపుతూ ఉపన్యసించాను. మేమందరం మేదినోత్సవంలో పాల్గొనడమూ, చైనాలోవుండే వివిధ ప్రదేశాలను సందర్శించడంతోనే తృప్తిపడకుండా ప్రస్తుతం ఆసియా ఖండాన్ని చుట్టుముడుతూన్న యుద్ధజ్వాలల్ని నిరోధించడానికి, శాంతిని స్థాపించడానికి కొంచెం యత్నం చేయాలని హెచ్చరించాము. భారతదేశానికీ, చైనాకూ టిబెట్టువిషయంలో జరిగిన ఒడంబడిక, దాని నిబంధనలు గురించి ప్రస్తావిస్తూ, కొన్ని వందల సంవత్సరాల పిదప ఈ రెండుదేశాలు సామ్రాజ్యతత్వపు రాజనీతిచే తెగగొట్టబడిన బాంధవ్యపు పాశాలను మరల ముడిపెట్టుకుంటూ, ఒకరి కష్టాల నింకొకరు సానుభూతితో ఆలోచించి పరస్పర గౌరవము, ప్రపత్తి మొదలయిన ముఖ్యవిషయాల నవగాహన చేసుకున్న ప్రథమ ఒడంబడిక యిదనీ, ఆసియా ప్రజలందరూ అన్నదమ్ములు-అక్క-చెల్లెంద్రవలె ప్రేమ పాశాలతో బంధింపబడ్డానికిది మొదటి కృషి అనీ, శాంతి స్థాపనకోసరం ఇతర దేశాలలో తమ దేశ వ్యవహారాల నేవిధంగా పరిష్కారం చేసుకోవాలో భారతదేశం, నవచైనా శాంతియుతమైన రాచబాట చూపాయనీ—చెప్పాను. ఇది నెహ్రూ పండితుని సౌహార్దానికీ, భారతదేశం చైనాపట్ల వహించే రాజనీతికీ తార్కాణమని కూడ చెప్పాను.

నే నింకా యేమి మాటలాడానో జ్ఞాపకంలేదు. నా ఉపన్యాసానంతరం, కామ్రేడ్ వి-చి-పో, కామ్రేడ్ క్రిష్ణని

నవ్ తమ కుర్చీలు వదలి నా దగ్గరకు వచ్చి నన్నభినందించారు. విందు ముగిసిన తరువాత పీస్ హోటలు వచ్చినప్పుడు, క్రింది హాలులో వీ రిద్దరు నన్ను కౌగలించుకొని ముద్దు పెట్టుకున్నారు. ఈ యిరువురు నాపై చూపిన యీ అఖండ ప్రేమకి నేను పాత్రుడనో కానో నాకింకా సందేహమే. కాని, వీరు నాకు చూపిన అపూర్వ గౌరవం నా జీవితంలో మరపురాని ఒక గొప్ప విషయం. తరువాత వీ రిద్దరూ నన్ను బలవంతంగా "ఆరోద్వారం" (Sixth gate) అనే సినిమా కీడ్చుకొనిపోయారు. ఈ సినిమా పీస్ హోటలు హాలులో ప్రదర్శింపబడుతూ వుంది. ఈ సినిమా కొమింటంగ్ పాలనలో కార్మికులజీవితం, కార్మిక నాయకులను పెట్టినపాట్లు, కార్మికవర్గం ధైర్యంతోను సాహసంతోను ప్రభుత్వాన్ని యెదుర్కొని తమ హక్కులకోసరం సాగించిన పోరాటాలు, నాయకుల త్యాగాలు, తుదకు కార్మికులు సాధించిన విజయం చూపించింది.

## 3

# పెకింగ్‌లో మే దినోత్సవ సంరంభం

పెకింగ్‌లో మే దినోత్సవ ప్రదర్శనలు నేత్రపర్వంగా వుంటాయి. నే నిదివరకు మన దేశంలో యెన్నో ప్రదర్శనాల్లో, ఉత్సవాలలో పాల్గొన్నాను. కాని యింతగొప్ప ప్రదర్శనాన్ని చూడలేదు. ఈ ఉత్సవంలో పాల్గొనడానికి నానాదేశాల నుంచి ప్రతినిధు లాహ్వానింపబడుతూ వుంటారు. ఈ ఉత్సవాలు "టీన్ - ఆన్ - మెన్" (శాంతి స్వర్గద్వారం) అని ప్రఖ్యాతి వహించిన పాతచక్రవర్తుల భవనసింహద్వారం ముందు చతుర్ముఖ ప్రదేశంలో జరుగుతాయి. ఈ ప్రదేశంలో రెండు లక్షల జనం సునాయాసంగా సమావేశం కావచ్చు. కాని ఆనాడు పదెనిమిదిలక్షలజనం సమావేశ మయ్యారు. ద్వారము, దాని ముందరి ప్రదేశము చాల సుంద రంగా అలంకరింప బడ్డాయి. ప్రాచీన చైనా శిల్పశోభకి తార్కాణ మైన ఈ ద్వారంపైన వేదికనుండి చైర్‌మన్ మావ్ సే-టుంగ్, చైనా సర్వసేనాని చూ-టే ఉత్సవాన్నీ, ఊరేగింపుల్నీ పర్యవేక్షిస్తూ వందనస్వీకారం చేస్తారు. వేదికపైన నవచైనా జాతీయ పతాకంతోపాటు యెటువంటి చిహ్నాలు లేని రక్త పతాకాలు అన్ని వైపులా ఎగురుతుంటాయి. ఈ సంవత్సరం మేదినోత్సవంలో అయిదు లక్షల జనం వివిధ పరిశ్రమలకు చెందినవారు ఉత్సాహంతో ఊరేగింపుల్లో పాల్గొన్నారు.

ఉత్సవాన్ని ప్రారంభిస్తూ పెకింగ్ నగర మేయర్ పెంగ్-చిన్, ఈ ఉత్సవాలలో పాల్గొనడానికి వచ్చిన వారికి, అంతర్జాతీయ

కార్మిక ప్రతినిధులకీ నవచైనా తరఫున హృదయపూర్వక స్వాగత మిస్తూ, వారందరు తమ ఆహ్వానాలను స్వీకరించి అనేక మైళ్ళ నుంచి ప్రయాసలకోర్చి వచ్చినందుకు కృతజ్ఞత వెల్లడించాడు. 28 మార్లు పేలిన ఫిరంగుల ధ్వనితో జాతీయ గీతాన్ని మేళతాళా లతో పాడుతూ వుండగా ఉత్సవం ప్రారంభమయింది.

ఆ ప్రదేశమంతా జనసమూహంతో ఒక మహాసముద్రంలా గోచరించింది. రకరకాల దుస్తులతో, పూల గుత్తులతో సమావేశమైన బాలబాలికల సమూహం పుష్పించి వికసించిన ఒక మహోద్యానంలా కనిపించింది. ఊరేగింపులు ఒకటితరువాత ఒకటి, వర్షాకాలం పిదప పరిపూర్ణంగా ప్రవహించే మహానదుల్లాగ సాగిపోతున్నాయి.

ఈ ఊరేగింపులలో ప్రజలు ఎర్రజండాలతోనూ ఛైర్ మెన్ మావ్, సేనాపతి చూ-తే, ప్రధానమంత్రి చౌ-ఎన్-లై, సన్-యత్-సేన్ మొదలైన చైనానాయకుల పటాలతోను మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్, మాలెంకోవ్ మొదలైన అంతర్జాతీయ నాయకుల, సోవియట్ నాయకుల పటాలతోనూ ముందుకు నడిచారు.

ఛైర్ మన్ మావ్ ముందుకు వచ్చినప్పుడంతా హర్షధ్వానాలు చేస్తూ, "హోపిన్-వాన్-సే" (ప్రపంచశాంతి చిరస్థాయి అగుగాక) అనే నినాదాలతో అతణ్ణి అభినందించారు. ఊరేగింపుల మధ్య పెద్ద పెద్ద అక్షరాలతో ప్రపంచశాంతిని కాంక్షిస్తూ వ్రాసిన అక్షరాలతోను, ఆకుపచ్చని, ఎర్రని జెండాలతోను అలంకరించబడిన బోర్డులు చైనాప్రజల శాంతిప్రయత్నాలకు నిదర్శనంగా గోచరిస్తున్నాయి. భవిష్యత్ లో చైనాకు ప్రాణతుల్యమైన బాల బాలికల భటసమూహాలు పూలగుత్తులతో ఆడుతూ, ఊరేగింపులో పాల్గొన్నారు. ఈ ఊరేగింపులన్నీ అంతర్జాతీయ ప్రతినిధులున్నస్థలానికి వచ్చినప్పుడంతా ఉత్సాహంతో "శాంతికోసరం, ప్రజాస్వామ్యంకోసరం పాటుపడే దేశాల ప్రజలందరికీ మా నమ



పెకింగ్‌లో మే దినోత్సవ ప్రదర్శనం: మే 1, 1956

భారత కార్మిక ప్రతినిధివర్గం
మే దినోత్సవ ప్రదర్శనలను తిలకిస్తున్న దృశ్యం.



కుడినుంచి ఎడమకు :

శ్రీ శిబన్‌లాల్ సగ్జేనా, రచయిత : శ్రీ రాఘవేంద్రరావు,
శ్రీ బినియ్‌రాయ్, శ్రీ పి. వి. జోషి, శ్రీ సయాబిహారీ శరణగారలు.

స్సులు" అని నినాదంచేస్తూ యితర దేశాల ప్రజలయెడ తమ గౌరవాన్ని వెల్లడించారు.

"అంతర్జాతీయ విభేదాలను శాంతియుతంగా పరిష్కరించుకోవాలి." "శాంతి అభివృద్ధులను కాంక్షించే ప్రజలంతా ఏకమై యుద్ధోన్మాదాన్ని అరికట్టాలి" "ఆసియాలో శాంతిని స్థాపించాలి." "ఇండోచైనా, కొరియా సమస్యలను శాంతియుతంగా పరిష్కారం చేయాలి" అనే నినాదాలతో ఉన్న బ్యానర్లు జనసమూహంలో విరివిగా గోచరించాయి. "మన కృషి అంతా సోషలిజం కోసరం, మన కష్టమంతా దేశ పునర్నిర్మాణం కోసరం" అనే నినాదాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి.

నిర్మాణ కర్మాగారాల కార్మికులు తమ ఊరేగింపులో, తాము నిర్మిస్తూన్న గొప్పగొప్ప యంత్రాల ప్రతిమలు, తమ తమ పరిశ్రమలలో అభివృద్ధిని సూచించే బోర్డులు, వారి నిర్మాణ కార్యక్రమాన్ని తెలిపే సూచికలు, రాబోయేసంవత్సరంలో దేశాభివృద్ధికి వారు చేయబోయే కార్యక్రమం ప్రజలకు తెలిసేటట్లు ప్రదర్శించారు. ఇదేవిధంగా రైల్వే కార్మికులు, గనులలో పనిచేసేవారు, భవననిర్మాణ శాఖల పనివారు వచ్చే సంవత్సరాంతం నాటికి చేయబోయే మహాత్కార్యాలను వ్యక్తపరిచారు. వీరు ప్రదర్శించిన లెక్కలనుబట్టి గత సంవత్సరంకంటె యీ సంవత్సరం బొగ్గుఉత్పత్తి వెయ్యికి 288 పాళ్లు, విద్యుచ్ఛక్తి నూటికి 22 పాళ్లు, నూనె (పెట్రోలు వగైరా) ఉత్పత్తి వెయ్యికి 716 పాళ్లు అభివృద్ధి చెందినట్లు వ్యక్తమయింది. వ్యవసాయాభివృద్ధికి యంత్రపరిశ్రమలు చేసే సహాయంకూడా యీ ప్రదర్శనంలో చూపబడింది. పెకింగ్‌కి 75 మైళ్ళ దూరంలో చైనా అంతటికీ పెద్దదయిన క్వాంటింగ్ రిజర్వాయరును నిర్మించిన కార్మికుల కృషిని మెచ్చుకుంటూ ఛైర్‌మన్ మావ్ పంపిన అభినందన సందేశాన్ని ఈ కార్మికులు పెద్ద పెద్ద అక్షరాలతో వ్రాసి ఊరేగింపులో ప్రదర్శించారు.

విద్యార్థుల ప్రదర్శనం చూడ ముచ్చటయింది. గత సంవత్సరం పెకింగ్ కళాశాలలనుంచి 4 వేలమంది విద్యార్థులు పట్టభద్రులయ్యారు. ఈ సంవత్సరం ఆ కళాశాలలనుంచే ఆరువేలమంది పట్టభద్రులు కానున్నారని తమ ప్రదర్శనంలో వీరు తెలియపరచారు.

ఈ ఉత్సవాలు ముగియగానే ఛైర్‌మన్ మావ్ విదేశాంగ రాయబారుల స్థానానికి, అంతర్జాతీయ ప్రతినిధుల స్థానానికివచ్చి, వారందరినీ దర్శించి గౌరవ పూర్వకంగా చేయెత్తి అభినందించాడు. ఆ సమయంలో అంతర్జాతీయ ప్రతినిధుల గ్యాలరీనుంచి, విదేశ రాయబారుల ప్రదేశంనుంచి, "ఛైర్‌మన్ మావ్ చిరంజీవి యగుగాక" అనే ఆశీస్సులు, కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి.

ఈ మే దినోత్సవంలో సోవియట్ యూనియన్, కొరియా, మంగోలియా, వియత్‌నాం, జెకోస్లోవేకియా, తూర్పుజర్మనీ, రుమేనియా, హంగరీ, బల్గేరియా, ఇండియా, ఇండోనేషియా, బర్మా, బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ, ఇస్రాయల్, గ్రీస్, జపాన్ దేశాల కార్మిక ప్రతినిధులు పాల్గొన్నారు.

ఒకవంక నవచైనాను కృంగదీయడానికి నేటి అమెరికా నాయకులు ప్రయత్నిస్తూ, చైనాకు ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం లేకుండా చేసి, తమ ఆధిపత్యాన్ని చైనాపై రుద్దడానికి ప్రయత్నం చేస్తున్నా, అదే అమెరికాలో ఒకనాడు కార్మికవర్గం గంటల పరిమితి కోసరం, ఆత్మగౌరవంకోసరం, తమ జీవితాలను బలియిచ్చారు. అట్టి అమెరికన్ వీరకార్మికుల పోరాటంతో ప్రారంభమైన అంతర్జాతీయ మే దినోత్సవాన్ని నవచైనా కార్మికవర్గం యింత బ్రహ్మాండంగా సల్పడం, వారికి జోహారు లర్పించడం, చైనా ప్రజల, కార్మికుల అంతర్జాతీయ దృక్పథాన్ని సూచిస్తుంది. ఇది ప్రపంచ కార్మికులంతా గర్వపడవలసిన విషయం. ఈ ఉత్సవాలు ఉదయం 8 గంటలకు ప్రారంభమై రెండు గంటలవరకు జరుగుతూ వుంటాయి. భారత దేశంలో దీపావళి పండుగవలె

ఆనాటిరాత్రి ప్రభుత్వ భవనాలు, ప్రజాసంస్థల భవనాలు దీపాలతో అలంకరింపబడి టపాకాయలు పేల్చబడి, మతాబులు వెలిగింపబడ్డాయి. పెకింగ్ నగర ఆకాశభాగమంతా ఆనాడు ఇంద్రధనుస్సువలె వెలుగుతో నిండిపోయింది.

మే దినోత్సవం మా కందరికీ ఒక విషయాన్ని స్పష్టపరిచింది; చైనాయొక్క నిర్మాణశక్తి, శాంతిస్థాపనయత్నం, ఆ దేశప్రజల పరిశ్రమ, ఏకాగ్రత, దృఢనిశ్చయం, ఐకమత్యం, క్రమశిక్షణ వీటికి మేదినోత్సవం నిదర్శనం. అనేక లక్షల జనంతో కూడిన యీ ప్రదర్శనలు ఒక గొప్ప సైనికదళంలాగు క్రమశిక్షణతో సాగిపోయినాయి. ఒక తప్పటడుగుగాని, ఒకరినొకరు ముందుకు తోయడంగాని జరగలేదు. చైనాప్రజల ఉత్సాహం వర్ణనాతీతం. ఒక మహాసముద్రంలాగు విశాలమై గంభీరమై పరిపూర్ణమైన నవ చైనా ప్రజల నిశ్చయ లక్ష్యాన్ని ప్రపంచంలోని అభివృద్ధి నిరోధక శక్తులన్నీ యేకమయినా అరికట్టలేవనీ, చైనా ప్రజాసముద్రం పొంగితే ఇవన్నీ తుడిచిపెట్టుకు పోతాయనీ స్పష్టం.

మే రెండు, మూడు తేదీలలో చాలమంది ఆసియా ప్రతినిధుల సూచనపై ఆసియాదేశాల ట్రేడ్ యూనియన్ ప్రతినిధుల సుహృద్భావ సమావేశమొకటి యేర్పాటు చేయబడింది. ఈ సమావేశంలో ఒండొరుల అభిప్రాయాలను, తమ తమ దేశాలలో కార్మికోద్యమాలు, వాటి అభివృద్ధి, కార్మికుల పరిస్థితి యివన్నీ తెలుసుకునేందుకు, ఒకరి అనుభవంనుండి యింకొకరు నేర్చుకొనుటకు అవకాశం లభించింది. ఈ సమావేశం జయప్రదంగా కొనసాగడానికి భారత ప్రతినిధులు కొంతప్రముఖపాత్ర నిర్వహించారు.

శాంతి, సౌభ్రాతృత్వము, ప్రేమ తొణికిసలాడుతూండే వాతావరణంలో ఈ సమావేశం జరిగింది. ప్రతినిధులందరూ తమ హృదయాలువిప్పి తమతమ దేశాల పరిస్థితుల్ని గురించి ముచ్చటించుకున్నారు. అనేక వందల సంవత్సరాలు దాస్యంలోమ్రగ్గి యిటీవలనే స్వతంత్రం పొందిన ఆసియాదేశాల ప్రతినిధులు తమ

అనుభవాలను వెల్లడిస్తూ, స్వతంత్రతంకోసరం, విముక్తికోసరం పోరాడుతున్న సోదర దేశాలపట్ల తమ సానుభూతిని వెల్లడిస్తూ, అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు ప్రభుత్వాలు ఇండోచైనా, మలయా, కొరియా దేశాల స్వతంత్ర పోరాటాల్ని ఆయుధబలంతో అణగ ద్రొక్కడానికి చేస్తూన్న ఘోరాన్ని ఖండించారు.

ఈ సమావేశపు తొలి ఉపన్యాసకులలో నే నొకణ్ణి. అధ్యక్షుడు హఠాత్తుగా నా పేరును నాటి ఉపన్యాసకులలో ప్రకటించాడు. నా ఉపన్యాసాన్ని వ్రాయడానికిగాని, సరిదిద్దుకో డానికిగాని వ్యవధి లేకపోయింది.

నా ఉపన్యాసాన్ని యిక్కడ క్లుప్తంగా యిస్తున్నాను :

గత నలభై సంవత్సరాలలో భారత కార్మికులు సాగించిన పోరాటం కేవలం తమ అభివృద్ధికొరకే కాదు; బ్రిటిషు సామ్రాజ్య దాస్యానికి స్వస్తిచెప్పడానికి జరిగిన స్వాతంత్ర్య పోరాటంలో అదొకభాగం. భారత కార్మికులు తమ దాస్యపు సంకెళ్లను విడగొట్టుకోడానికి ఇతర దేశభక్తులతోపాటు స్వతంత్ర సంగ్రా మంలో పాల్గొన్నారు. భారతదేశం పరాధీనంగా వున్నప్పుడు ఐకమత్యంతో ఒకటిగా నడచిన కార్మికవర్గం స్వతంత్రం పొందిన తరువాత వివిధ మార్గాలు అనుసరించి చీలికలై పోయింది.

భారత కార్మికులు రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొంది కూడ, ఆ స్వాతంత్ర్యంవల్ల తమకు లభించవలసిన ఫలితాన్ని పొందలేకపోయినారు. ఒకవైపు ఆర్థిక స్వాతంత్ర్యంకోసం వారు తీవ్రకృషి చేయడానికి ప్రయత్నిస్తూంటే, రెండో వైపునుంచి అనేక సంవత్సరాలు ఎడతెగక సాగించిన పోరాటాలవల్ల మహా త్యాగాలవల్ల సంపాదించుకొన్న రాజకీయ స్వాతంత్ర్యానికే ముప్పు వాటిల్లుతోంది. భారతదేశ సింహద్వారంనుంచి నిర్గమించిన సామ్రాజ్యతత్వం పెరటి గుమ్మంనుంచి జొరపడడానికి యత్నం చేస్తోంది. కార్మికనాయకులీ కొత్తప్రమాదాన్ని గుర్తించి, దాని నరికట్టడానికి తమశక్తిని వినియోగించవలసి యుంది. అమెరికా




ఆసియా కార్మికవర్గ ప్రతినిధుల సమావేశంలో రచయిత ఉపన్యసిస్తున్న దృశ్యం.



నాంకింగ్‌లో చాంగ్ కై షేక్ చే ఉరి తీయబడ్డ, కాల్చి చంపబడ్డ విప్లవవీరుల స్మారక చిహ్నం (పుష్పవర్ష వేదిక). స్మారక చిహ్నం మీద ఛైర్మన్ మావ్ స్వహస్తంతో వ్రాసిన అక్షరాలున్నాయి.

సామ్రాజ్య నియంతృత్వం అప్పుడే మా పొరుగింట ప్రవేశించి మా పొలిమేరల్లో కయ్యానికి కాలుదువ్వుతోంది.

సామ్రాజ్యవాదుల కూటమి చైనా ప్రజాప్రభుత్వంపై దుష్ప్రచారం సాగించినట్లే, భారత ప్రభుత్వం పైన కూడా ప్రచారంసాగిస్తూ, మా విదేశాంగ విధానంవల్ల మేము మా స్నేహితుల సానుభూతిని కోల్పోయామని ప్రపంచ మంతటా దండోరా వాయించుకోంది. సామ్రాజ్యవాదులు సత్యాన్ని తలక్రిందులు చేయడానికి ప్రయత్నిస్తున్నారు. శాంతికి ప్రాతి పదికగా భారతదేశంచేసే ప్రయత్నాన్ని హర్షిస్తూ, భారతదేశపు సూచనలను గౌరవంతో ఆలోచించి అనుసరించడానికి మా పొరుగు సోదర దేశాలయిన సోవియట్‌యూనియన్, నవచైనా సంసిద్ధంగా వున్నాయి. మాతో సఖ్యతగావుండే యితర ఆసియాదేశాలుకూడా తమ సంసిద్ధత ప్రకటించాయి. శాంతిని కాంక్షించే ప్రజలంతా మా మిత్రులే. ఈ సమావేశమే యిందుకు తార్కాణం.

భారతదేశంలోని కార్మికోద్యమాన్ని గురించి, మా బలం బలహీనతల గురించి నిర్మొగమాటంగా చెప్పదలచుకున్నాను. భారత కార్మికులందరూ ప్రపంచ శాంతి భద్రతలకోసరం దృఢ నిశ్చయంతో వున్నారు. చాలీచాలనిజీతాల సంకెళ్ళను తెగగొట్టు కోడానికి ప్రయత్నిస్తున్నారు. ఉత్పత్తిలో తాము కేవలం సాధ నాలు కారని భారతకార్మికులు గ్రహిస్తున్నారు. తమదేశ స్వాతం త్రానికి ముప్పుకలిగితే వీరంతా ఏకమయి, దేశభక్తితో ఎదిరించి తమ స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకునేటందుకు ఎన్ని త్యాగాలైనా చేస్తారు. ఇది మా బలం. ఇక మా బలహీనత యెక్కడుందో కూడా చెప్తాను. మాలో వివిధ రాజకీయపార్టీలకు చెందిన కార్మిక నాయకులు ఐక్య కార్మికోద్యమ నిర్మాణానికి తగినంతగా కృషి చేయడంలేదు. రైల్వేకార్మికులమైన మేము మా విభేదాలకు స్వస్తిచెప్పి మళ్ళీ ఒక కేంద్రసంస్థలో చేరగలిగాం. ఈవిధంగా రైల్వేకార్మికోద్యమం యితరులకొక గుణపాఠం చెప్పింది.

అనేకదేశాలకు చెంది అనేక అభిప్రాయాలు గల ప్రతినిధులతో కూడిన యీ సుహృద్భావ సమావేశం ప్రపంచశాంతికి, అభివృద్ధికి శత్రువులైనవారివల్ల కలిగే ముప్పును యెదుర్కోడానికి తోడ్పడాలి. ఈ పవిత్ర కార్యనిర్వహణలో అవసరమైతే మన మంతా ఏకంగా నిలచిపోరాడడానికి, ఏకంగా మరణించడానికి సిద్ధంగా వున్నామని ప్రపంచానికి తెలియపరచాలి.

ఇదీ నా ఉపన్యాసం. ఈ సుహృద్భావ సమావేశంలో వివిధదేశాల, సంస్థల ప్రతినిధులు తమ అభిప్రాయాలను వెల్లడించారు. ఆసియా ఖండంలో 9 దేశాలనుంచి, 17 కార్మికసంస్థలనుంచి 55 మంది ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. ఇతర దేశాల ప్రతినిధులుకూడ యీ సమావేశ చర్చలు వినడానికి ప్రత్యేకానుమతిమీద వచ్చారు. భారతదేశ ప్రతినిధులయిన శ్రీ బినారాయ్, సియాబిహారీశరణ్, సిబ్బన్‌లాల్‌సక్సేనాకూడ ఉపన్యసించారు. వీరు, తమ ఉపన్యాసాలలో ఆసియా శాంతి కొరకు, ప్రపంచ శాంతికొరకు, విదేశ పరిపాలననుండి విముక్తి కొరకు కృషిచేయాలని ఏకగ్రీవంగా తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. ఆసియాలో వలసరాజ్యాంగ విధానాన్ని, సామ్రాజ్యవాదుల నిరంకుశత్వాన్ని గర్హిస్తూ, సామ్రాజ్యవాదులు ఆసియాను తమ వలసప్రదేశంగా పాలించేరోజులు గతించాయనీ, ఆసియా ప్రజలు తమ దేశ వ్యవహారాలను తాము పరిష్కరించుకోవడంలో యితరుల జోక్యాన్ని సహించరనీ ఖచ్చితంగా తెలిపారు.

ఈసమావేశంలో పాల్గొన్న ప్రతినిధులంతా కొరియాసమస్య శాంతియుత పరిష్కారానికి అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రతిబంధకాలు కల్పిస్తూ, ఇండోచైనాలో యుద్ధజ్వాలల్ని రెచ్చగొడుతూ... తెగ్రపాకిస్తూ ఆసియాఖండంలో సైనిక స్థావరాలను యేర్పరచుకొని, ఆసియాలో దౌర్జన్యాన్ని ప్రోత్సహించే సైనిక ఒడంబడికలు చేసుకొని, జపాన్‌ను మళ్ళీ సైనికంగా బలపరచి, ఆసియా శాంతికి భంగం వాటిల్ల జేసే దురుద్దేశంతో పాకిస్తాన్‌తో సైనిక ఒడంబడిక చేసు

కొని, ఆయుధసహాయం చేస్తున్నందుకు ఖండించారు. పసిఫిక్‌లో హైడ్రోజనుబాంబుల ప్రయోగాన్ని తీవ్రంగా విమర్శించారు. సామ్రాజ్యవాదుల యీ విధానం ఆసియా దేశాలలోని కార్మికుల, కష్టజీవుల, సామాన్యప్రజల జీవితాలకు నష్టం కలిగించి, ఆయా దేశాల ఆర్థిక విధానాన్ని ధ్వంసంచేసి కృంగదీయడానికి చేసే ప్రయత్నమని ప్రకటించారు. అమెరికా అవలంబిస్తూన్న ఈ విధానం ఆసియా స్వాతంత్ర్యానికి, భద్రతకి ముప్పు తేవడమే కాకుండా ప్రపంచ శాంతికే భంగమని తెలియజేశారు.

ప్రతినిధులంతా ఆసియా దేశాల స్వాతంత్రం, ప్రజా ప్రభుత్వ విధానం, ప్రజా స్వాతంత్ర్యం, సంపూర్తిగా సంరక్షించ బడాలనే ఆశయాన్ని ఏకగ్రీవంగా వెల్లడించారు. ఎట్టి ఆటంకాలు లేకుంటూ ఇతర దేశాలతో వాణిజ్యానికి అవకాశాలుండాలనీ, ఉత్తమమైన ఆర్థిక విధానాలు నెలకొనేటందుకు, తమ దేశాల స్వతంత్రం సంరక్షించుకోడానికి ప్రపంచ శాంతికొరకు పాటుపడా లని నిశ్చయించుకున్నారు.

ప్రపంచ కార్మికుల ఐకమత్యం, అంతర్జాతీయ కార్మి కోద్యమం అభివృద్ధిచెంది ఒకరికొకరు సహాయంగా మెలగాలని ప్రతినిధులంతా నిశ్చయించారు.

ప్రతి దేశంలోను కార్మికులు, కర్షకులు తమ స్నేహాన్ని దృఢతరం చేసుకొని శాంతిప్రియులైన ప్రజానీకంతో సహకరించి తమతమ దేశాల స్వతంత్రం, భద్రత, ప్రజాప్రభుత్వ విధానం స్థిర పరచి కార్మిక – కర్షకుల హక్కులను కాపాడాలని తెలిపారు.

ఇట్టి సమావేశాలు ఆసియా ఖండంలోని వివిధదేశాల కార్మికసంస్థల్నీ, కార్మికుల్నీ సన్నిహితం చేయడానికి, పరస్పర స్నేహం వృద్ధిపొందే వాతావరణంలో ఒకరితో ఒకరు చర్చించు కొని తమతమ అభిప్రాయాలను వెల్లడించుకోడానికి, పరస్పర సహకారం పొందడానికి యెంతో వుపయోగపడతాయని, ఇటు

వంటి సమావేశాలు తరచు జరుగుతూ వుండాలనీ అంతా అభిప్రాయపడ్డారు.

పెకింగ్‌లో మే 5 వ తేదీనుండి 8 వ తేదీవరకు జరిగిన యీ కార్మిక ప్రతినిధుల సుహృద్భావ సమావేశంలో జరిగిన చర్చలు ఒక తీర్మానరూపంలో వ్యక్తం చేయబడ్డాయి. ప్రతినిధులంతా ఆ తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు.

ప్రప్రథమంగా ఆసియాఖండంలోని కార్మిక ప్రతినిధులు ఒకచోట కలవడం, కలిసి తమ అభిప్రాయాన్ని వెల్లడించడం, ఒకరినొకరు అర్థంచేసుకోడానికి కృషిచేయడం, వివిధ దేశాలలోని రాజకీయ, ఆర్థికవిషయాలను అవగాహన చేసుకోడం ఒక మహత్తర విషయం.

ఈ సమావేశంలో చైనా ప్రతినిధుల ప్రవర్తన శ్లాఘనీయమైంది. ఎంతో అభివృద్ధిపొంది తమ దేశంలో కార్మికప్రభుత్వాన్ని నిర్మించి ప్రపంచదేశాలలో కీర్తి ప్రతిష్ఠలు పొందిన సోవియట్ యూనియన్ ప్రతినిధులు, చైనా ప్రతినిధులు, యితర చిన్న దేశాల ప్రతినిధులతో ఎటువంటి ఆధిక్యత లేకుండా చాలనమ్రతతో ప్రవర్తించారు. తమ గొప్పతనాన్ని వ్యక్తపరచారు.

# 4

# పెకింగ్ నగర పూర్వచరిత్ర

పెకింగ్ పట్టణం చారిత్రకంగా ప్రసిద్ధిచెందిన మహోన్నత భవనాలతోనూ, శిల్పసంపదకూ ప్రకృతి సౌందర్యానికీ నిలయమైన స్థలాలతోనూ కళకళలాడుతూ వుంటుంది. ఇది అన్నివిధాల ఢిల్లీని తలపిస్తూ వుంటుంది. పురాతన చారిత్రక ప్రదేశాలే కాకుండా కొత్త కొత్త ప్రభుత్వ భవనాలు, కళాశాలలు, విశ్రాంతి మందిరాలు, ఉద్యానవనాలు యీ పట్టణానికి కొత్తశోభ కల్పిస్తున్నాయి. పెకింగ్ పట్టణం భూత వర్తమాన భవిష్యత్ కాలాల రాజకీయ చరిత్రకు, విజ్ఞాన వికాసాలకు ఒక గొప్ప తార్కాణం. విముక్త చైనాకు రాజధాని అయిన యీ పట్టణం అనేక ప్రభుత్వ విధానాల్ని చవిచూచింది. ఒకప్పుడు చక్రవర్తుల నిరంకుశ పాలనలో సకల సౌఖ్యాలు అనుభవించే రాజబంధువులతోనూ, వారి ఆశ్రితులతోను, వారి స్వార్థంకోసరం అనుక్షణం పీడింపబడుతూ బీదరికంతో, నిరాశతో క్రుమ్గే జనసామాన్యంతోను, ఇంకొకప్పుడు కొమింటాంగ్ దుష్పరిపాలనకూ, అరాచకపు రాజనీతికీ, నిరంకుశత్వానికీ, ప్రజా క్షోభకూ గురియై కొంత కాలము, జపాన్ సామ్రాజ్యతత్వపు విశృంఖల పీడనతోనూ, దేశద్రోహులైన ప్రభుత్వాధికారులతోనూ పరిపాలింపబడి తగని దుర్దశల ననుభవించిం దీపట్టణం.

జపాన్ పతనానంతరం చాంగ్‌కై షేకు పరిపాలనా దుర్నీతిని, అన్యాయాలను, అక్రమాలను యెదిరిస్తూ కార్మికు లెన్నోసార్లు

సమ్మెలు జరిపి ప్రభుత్వాన్ని కూలదోయటానికి యత్నించారు. విద్యార్థులు కూడ ఈ పోరాటాలలో చైతన్యంపొంది ప్రభుత్వ విధానాన్ని ఖండిస్తూ ఎన్నో ప్రదర్శనలు జరిపారు. కొమింటాంగ్ గూఢచారుల రాక్షసదళం ఎంతోమంది కార్మిక నాయకుల్ని, విద్యార్థి నాయకుల్ని హత్యచేసి ప్రజలలో భీతావహం కల్పించడానికి యత్నించింది. ప్రజాశక్తులన్నీ ఏకమయి ఈ రావణాసుర పరిపాలనను ఎదిర్చాయి. ఉత్సాహంతోను, పట్టుదలతోను విజృంభిస్తూవుండే ఈ ప్రజావాహిని కెదురొడ్డే సాహసంలేక చాంగ్‌కై షేక్ తన ప్రభుత్వాన్ని పెకింగ్ నుంచి నాంకింగ్‌కు ఒకప్పుడు మార్చుకున్నాడు. విప్లవసైన్యాలీ పట్టణాన్ని చుట్టుముట్టినప్పుడు చాంగ్‌కై షేకు దళాలు తలపడడానికి యత్నించాయి. కాని పెకింగ్‌ను సాయుధబలంతో ఆక్రమించుకోడం ప్రజాసైనిక నాయకులకు యిష్టంలేక పోయింది. యుద్ధంవల్ల పట్టణంలో చారిత్రక భవనాలు ముఖ్యస్థలాలు నామరూపాలులేకుండా పోవచ్చునని, ఈ పట్టణాన్ని అటువంటి దురవస్థనుండి కాపాడాలని వారు నిశ్చయించుకున్నారు. కొమింటాంగ్ సైనిక దళాలకు, నాయకులకు అస్త్రసన్యాసంచేసి లొంగిపోవడానికి మూడు దినాలు గడువిచ్చారు. ఆ విధంగా లొంగి పట్టణాన్ని వశంచేస్తే వారి పట్ల దయాదాక్షిణ్యాలు చూపబడుతాయని కూడ ప్రకటించారు. చాంగ్ దళాలు, ఇదివరకే తమ సైన్యాలు వివిధ ప్రాంతాలలో ఛూ: టే సైన్యాల ముందు నిలువలేక లొంగిపోయిన విషయం బాగా గ్రహించి నందున, గడువు లోపల పట్టణాన్ని విప్లవసైన్యానికి ఒప్పగించారు. నేడు పెకింగ్ నగరం ఉత్సాహంతో ఆనందంతో నూత్న శక్తితో యావనంలో వున్న సౌందర్యవతిలా గోచరిస్తుంది.

చి–నీన్–టెన్ (స్వర్గ దేవాలయం) 1419 వ సంవత్సరంలో మింగ్ రాజ వంశస్థులచే నిర్మింపబడింది. 1751 వ సంవత్సరంలో మంచూ చక్రవర్తులచే పునర్నిర్మాణం చేయబడింది. పిడుగుదెబ్బ వల్ల 1889 వ సంవత్సరంలో చాలభాగం శిథిలమైపోగా, మళ్ళీ

నిర్మాణం చేయబడ్డది. ఈ ఆలయం గొప్పగొప్ప స్తంభాలతోను, ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన రంగు పెంకులతోను నిర్మింపబడ్డ విశాలభవనం. దీని ద్వారాలలోని రాతిశిల్పం భారతదేశంలోని బౌద్ధ స్థూపాల శిల్పాన్ని పోలివుంటుంది. ఇది భారత చైనాదేశాల శిల్పబాంధవ్యానికి తార్కాణం. ఈ ఆలయం, అనేక వందల సంవత్సరాలు ప్రజలెవ్వరికి ప్రవేశార్హత లేకుండా ప్రత్యేకంగా చక్రవర్తుల ప్రార్థనామందిరంగా వెలిసింది. విముక్తిపొందిన తరువాత యీ ఆలయంలోకి యెటువంటి ప్రతిబంధకాలు లేకుండా ప్రజలందరూ ప్రవేశిస్తున్నారు. నేడిది చైనాప్రజల సొత్తు.

చక్రవర్తుల గ్రీష్మభవనం పెకింగ్‌కు వాయవ్యంలో నిర్మింపబడ్డ మహాభవనాల కూటమి. దీన్ని "ఐ-హో-యాన్" అంటారు. దీని అర్థం "శాంతి దాక్షిణ్యాల ఉద్యానవనం" అన్నమాట. ఈ ప్రదేశంలో ఎన్నో ఉన్నతభవనాలు, గుళ్ళు, గోపురాలు, తోటలు కాసారాలు, వంతెనలు మొదలైనవి వున్నాయి. వీటన్నిటిని ఎందరో చక్రవర్తులు తమ పరిపాలనలో తమ భోగవిలాసాల కోసం నిర్మించారు. దీని వైశాల్యం ఢిల్లీ ఎర్రకోటను మించి వుంటుంది. ఇందులోవుండే భవనాలన్నీ శిల్పసంపదకు, కుడ్య చిత్రాలకు నిలయాలు. ఈ భవనాలకు వెనుకభాగంలో, తటాక తీరంలో ఒక కొండపై గొప్ప బౌద్ధదేవాలయం వుంది. దాన్ని నవచైనాప్రభుత్వం ఎంతో వ్యయంతో బాగుచేయిస్తోంది. పెకింగ్‌లో అనేకమంది చక్రవర్తులు తమ తమ అభిరుచులకు అనుకూలంగా నిర్మాణంచేయించిన మహాలులెన్నో ఉన్నాయి. వీటికి సంబంధించిన ఉద్యానవనాలు కూడ మిక్కుటంగా వున్నాయి.

1860 వ సంవత్సరంలో, బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్య సేనలు పెకింగును ఆక్రమించి, ఈ భవనాల్నీ, ఉద్యానవనాల్నీ నాశనంచేశాయి. 1888 వ సంవత్సరంలో రాజమాత యెంతో వ్యయంచేసి వీటినన్నిటినీ బాగుచేయించి, మరికొన్ని నూతన భవనాలను కూడ నిర్మించి, పడిపోయినవాటి శోభను పునరుద్ధ

రించింది. ఐ-హో-యూన్ అనే పేరు ఆమె పెట్టినదే. 1900 వ సంవత్సరంలో అమెరికా, బ్రిటిషు, ఫ్రెంచి, జపాను సామ్రాజ్య సేనలన్నీ ఏకమయి పెకింగ్‌పై దాడిజరిపి, ఈ భవనాలన్నిటినీ తమ శతఘ్నులకు ఆహుతిచేసాయి. వీటిలోవుండే అపారమైన, అమూల్యమైన వస్తుసముదాయాన్నంతా కొల్లగొట్టి తమ దేశాలకు పంచుకొనిపోయారు. 1901 వ సంవత్సరంలో రాజమాత వీటినన్నిటిని మళ్ళీ బాగుచేయించింది. 1911 విప్లవంలో ఇది చక్రవర్తి స్వంత ఆస్తిక్రింద అతనికి వదిలివేయబడినా, 1914లో టిక్కెట్లనుపెట్టి ప్రజల కిందులో ప్రవేశించడానికి అవకాశం కల్పింపబడింది. 1924 వ సంవత్సరంలో చైనాలో రాచరికానికి నామరూపాలు లేకుండాపోయినతరువాత ఇవన్నీ ప్రజా ప్రభుత్వానికి వశమైనాయి. మళ్ళీ జపాన్ దురాక్రమణకివి లొంగి జపాన్ సైనికుల దౌష్ట్యాలకు గురియై శిధిలమైనాయి. 1949 వ సంవత్సరంలో చైనా విముక్తి అనంతరం యీ భవనాలన్నీ ప్రజాయత్తమైనాయి. అనేకవందల సంవత్సరాలు చైనా చక్రవర్తులకూ, వారి అంతఃపుర జనానికీ విలాస మందిరాలైన యీ భవనాలు నేడు నవచైనా ప్రభుత్వంచే కార్మికవర్గానికి విశ్రాంతిమందిరాలుగా చేయబడ్డాయి.

చక్రవర్తుల శరత్మందిరాలైన 'పీహై' భవనాలుకూడా చూడతగ్గవి. ఒక గొప్ప కోటవలె నిర్మింపబడ్డ ప్రదేశంలో యివి వున్నాయి. ఈ భవనాలకూటమి 864000 మీటర్ల (ఒక మీటర్ గజంకంటె కొంచెం పెద్దగా వుంటుంది.) ప్రదేశాన్ని ఆక్రమించింది. కొన్నివందల సంవత్సరాలు చక్రవర్తుల నివాసమైన యీ భవన ప్రాంతంలో చైనా ప్రజలడుగుపెట్టడానికి అదృష్టమూ, హక్కూ లేకపోయింది.

మహోత్కృష్టమైన చైనా శిల్పసంపదకు తార్కాణంగా 1406 వ సంవత్సరంలో ప్రారంభింపబడి 1414 లో పూర్తిచేయబడ్డ మంచూ చక్రవర్తుల భవనాలుకూడ పెకింగ్‌లో వున్నాయి. ఈ భవనాలన్నిటిలో ప్రజలెవ్వరికి ప్రవేశార్హత లేక పోవడం

వల్ల వీటికి "నిషిద్ధ పట్టణం" అనే పేరు వచ్చింది. ఈ భవనాలు 1911 లో ఆఖరు చక్రవర్తియొక్క నివాసమందిరం అయినందువల్ల చక్రవర్తుల పరిపాలనాధికారానికిది అంతిమ స్థావరమైంది. ఈ కోటలో చక్రవర్తుల సభా మందిరాలు, విలాస మందిరాలు, భోజనశాలలు ఉన్నాయి. బంగారు రంగుపూత పూసిన చైనా పెంకులతో వీటికప్పు మెరిసిపోతూ వుంటుంది. ఇవన్నీ యిప్పుడు ప్రజల సొత్తయి, వీటిలో వివిధ ప్రదర్శనశాల లేర్పాటు చేయబడ్డాయి. ఒకప్పుడు చక్రవర్తులు షికారుచేస్తూ వుండిన ఆవరణలో సన్-యత్-సేన్ పార్కు నిర్మింపబడింది. చక్రవర్తుల భవనాలు కార్మికుల విజ్ఞాన మందిరాలుగా మార్చబడ్డాయి. వీటిలో వెలలేని విచిత్ర వస్తువులను కొమింటాంగ్ లంచగొండి అధికారులు ప్రపంచ కోటీశ్వరులకు దొంగతనంగా అమ్ముకొన్నారు.

పెకింగ్ కళాశాలలు కూడ చాల ముఖ్యమైనవి. అమెరికన్ విద్యావిధానానికి కీలక స్థానంగా సింగ్‌హ్వా యూనివర్సిటీ నెలకొల్పబడింది. దీని చరిత్ర చాల విచిత్రమైనది. చైనా యువకుల్ని మానసికంగా అమెరికన్లుగా మార్చడానికిది యేర్పడింది. అమెరికన్ ఉపాధ్యాయులు తమ చాతుర్యంచేత చైనా యువకులకు తమ మాతృభాషమీద అసహ్యత కలిగించడానికెంతో యత్నం చేశారు. ఈ ఉపాధ్యాయులు తమ విద్యావిధానంవల్ల చైనా యువకులను ఆంగ్లభాషా బోధనద్వారా వారిలో వుండే వ్యక్తిత్వము, స్వాతంత్ర్యాభిలాష, దేశభక్తి మొదలయిన ఉత్తమ గుణాలను రూపుమాపి అమెరికా మానస పుత్రులుగా తయారు చేయడమే తమ కర్తవ్యంగా వ్యవహరించారు. చైనాలో అమెరికన్ విద్యావిధానమంతా చైనా విజ్ఞాన సంస్కృతులమీద ఒక కుట్రగా స్ఫురిస్తుంది. 1925 లో విప్లవ భావాలుగల యువకులీ కళాశాలను ఆక్రమించుకొని దానిని విశ్వవిద్యాలయంగా మార్చారు. తదనంతరం ఈ యూనివర్సిటీ కొమింటాంగ్, జపాన్ పరిపాలనకు లోనయింది. ఈ మార్పువల్ల సింగ్-హ్వా యూనివర్సిటీ ఒక

ఆశ్చర్యకరమైన విధానాన్ని అవలంబించింది. విశ్వవిద్యాలయాధికారులు దీన్ని కొమింటాంగ్, జపాన్ ప్రభుత్వాలకు నప్పగించకుండా అనేక ప్రదేశాలలోకి తిప్పడం మొదలుపెట్టారు. ఈ కళాశాల తన జీవితంలో అనేక వేలమైళ్లు యెడతెగని ప్రయాణం చేసింది. ఇది స్థాపింపబడ్డ ప్రదేశాన్ని జపాన్‌గాని, కొమింటాంగ్‌గాని ఆక్రమిస్తే, వేరే ప్రదేశానికి వలసపోయేది. ఉపాధ్యాయులు, విద్యార్థులుకూడ దీనితోపాటు దేశం అంతా తిరుగుతూ ప్రజలలో విప్లవజ్వాలలు రగుల్గొలిపారు. వీరంతా చైనా విముక్తికెంతో పాటుపడ్డారు.

చైనా స్వతంత్రం పొందిన తరువాత ఈ విశ్వవిద్యాలయం మళ్ళీ తన జన్మస్థానానికి వచ్చింది. దీని ఆధిపత్యంలోనే అనేక కళాశాలలు వెలిశాయి. ఇందులో చైనాభాష, చరిత్ర, విజ్ఞానాలను గురించి నేర్వదలచిన విదేశ విద్యార్థులకు ప్రవేశముంది.

ఈ యూనివర్సిటీలో హిందీభాషకూడ బోధింపబడుతోంది. కొంతమంది భారతదేశాచార్యులు యిక్కడున్నారు. విద్యార్థుల హృదయాలలో క్రమశిక్షణ, విశ్వసౌభ్రాతృత్వము, సత్ప్రవర్తన, దేశభక్తి మొదలయిన సద్గుణబీజాలు నాటబడుతున్నాయి. ఈ విశ్వవిద్యాలయంనుంచి 50 మందికిపైగా చైనా యువతీ యువకులు 1954 లో హిందీలో పట్టం పొందారు. తర్వాత సంవత్సరం యింకా నాలుగు ప్రధాన భారతీయ భాషలకు స్థానం కల్పించబడింది. భారత నాగరికత, విజ్ఞానాలను గురించి తెలుసుకోడానికి నవచైనా యత్నిస్తోంది.

1919 వ సంవత్సరంలో అమెరికా ధన సహాయంతో "యోంచింగ్" యూనివర్సిటీ స్థాపించబడింది. దీని ఆధిపత్యమంతా అమెరికన్లదే. ఈ యూనివర్సిటీ ఆశయాలు, విద్యావిధానము అంతాభారతదేశంలో 'మెకాలే' అవలంబించిన విధానాన్ని జ్ఞప్తికి తెస్తాయి. చైనాలో అమెరికా ఆధిపత్యాన్ని నెలకొల్పడానికి, తమ సామ్రాజ్య తత్వానికి చైనా స్వతంత్రాన్ని బలి చేయడానికి,

చైనా యువకులనే వినియోగించేందుకు ఈ యూనివర్సిటీ నిరంతర కృషిచేసింది. ఈ విధానాన్ని బలపరచడానికి అమెరికన్ పాదరీలెందరో విద్యా సంస్థలను యేర్పరచి తోడ్పడ్డారు. వీరంతా ఆర్థికంగా, వైజ్ఞానికంగా చైనాను కొల్లగొట్టడానికి ఏర్పడ్డ బంది పోటు దొంగలగుంపు. వీరందరికీ హాంచౌలో జన్మించిన "లైటిన్ స్టార్" నాయకుడు. ఈ మహానుభావుడు తాను చైనాలో జన్మించి నందున తాను చైనా పౌరుడనని చెప్పుకుంటూ చైనా భాషకు, స్వాతంత్ర్యానికి, విజ్ఞానానికి యెసరుపెట్టాడు. ఇంచుమించు 25 సంవత్సరాలపాటు రాజకీయాలతో సంబంధంలేని కేవలం విద్యా ప్రచారకుడుగా నటించిన యితడు చైనా స్వతంత్రసేనలు కొమింటాంగ్ దళాల్ని చుట్టుముడుతున్న సమయంలో, హఠాత్తుగా అమెరికన్ ప్రభుత్వ రాయబారిగా నియోగింపబడ్డాడు. ఇంతేగాక చైనాదేశంలో అవిద్యను రూపుమాపడమే మత పవిత్రధర్మమని చాటుకొంటూ కేవలం విద్యావ్యాప్తికే మా కృషి అంతా అని ఢంకాకొట్టిన యీ అమెరికన్ ఉపాధ్యాయులంతా, చైనా రాజకీయాలలో జోక్యం కల్పించుకొని, చాంగ్ కై షేకుకు, అతడి అనుచరవర్గానికి సకలసహాయం చేయవలసిందని అమెరికా ప్రభుత్వాన్ని అభ్యర్థించారు. దీన్నిబట్టి వీరు కేవలం విద్యాప్రబోధకులో, రాజకీయ గూఢచారులో ప్రపంచానికి వెల్లడయింది. 1950 వ సంవత్సరంలో అమెరికా ప్రభుత్వం చైనా ప్రజాప్రభుత్వపు ధనాన్నంతా జప్తుచేసుకుని, ఈ కళాశాలకు వచ్చే ఆర్థికసాయాన్ని అరికట్టింది. 1951 వ సంవత్సరంలో చైనాప్రభుత్వం యీ విశ్వవిద్యాలయాన్ని తన ఆధిపత్యంలోకి తీసుకొని, చైనా యువకుల్ని అమెరికా భావదాస్యశృంఖలాలనుంచి విముక్తిచేసింది.

పెకింగుకు యించుమించు 70 మైళ్ళ దూరంలో ప్రపంచ మహాద్భుతాలలో ఒకటైన చైనా మహాభిత్తి (చైనాగోడ) వుంది. ఇది ప్రపంచసప్తమహాద్భుతాలలో ఒకటి. రెండువేల ఐదు సంవత్సరాలకుముందు ఇదినిర్మాణం చేయబడింది. దీని నిడివి పటంపైన కొలి

చిన 17వందల మైళ్లు. కానినిర్మాణంలో, పర్వతాలెక్కి దిగడంలో మలుపులు తిరగడంవల్ల దీని నడక 3000 మైళ్ళ వరకు సాగింది. ఎత్తయిన పర్వతాగ్రములనుండి క్రిందకు దిగుతూ మళ్ళీ ఎక్కుతూ అనేక మలుపులు తిరుగుతూ చూడడానికిదొక మహాకాలసర్పంలా, పర్వతాగ్రములనుండి ప్రవహించే గొప్ప నదిలా తోస్తుంది. "షీ - హు - నాగ్తి" చక్రవర్తి కాలంలో దీని నిర్మాణం ప్రారంభ మయినది. చైనా దేశంపై దండెత్తి నానాబీభత్సాలు చేసే తార్తారు మూకల్ని అరికట్టడానికి, విదేశ సేనావాహినులు చైనా దేశంలో ప్రవేశించకుండా సంరక్షించుకోడానికి నిర్మించబడ్డ రక్షణ శ్రేణియిది. అనాదికాలంలో చైనా ప్రజల నిర్మాణశక్తి సామర్థ్యా లకిది ప్రబల సాక్ష్యం. యంత్రసహాయం లేని ఆకాలంలో ఎత్తయిన పర్వతశిఖరాల కిన్ని రాళ్ళు, సున్నము, నీళ్ళు మొదలయిన వాటి నేవిధంగా చేర్చగలిగారో ఊహించడానికి కూడా కష్టం. అనేక శతాబ్దాలు ప్రకృతి ధాటికి ఇది నిలవడం చైనా ప్రజల నిర్మాణ సామర్థ్యతను నిరూపిస్తుంది. ఇది గొప్ప కోటగోడవలె అక్క డక్కడ బురుజులతో నిర్మింపబడింది. దీనిఎత్తు రమారమి 40 అడు గులు, వెడల్పు 20 అడుగులు మించి వుంటుంది.

మేమంతా రైలులోకాక మోటారులో దీన్ని చూడడానికి ప్రయాణంచేశాం. ఎత్తయిన ఒక పర్వతశిఖరపు బురుజువరకు నడచి, అక్కడ కొంత విశ్రమించి, మధ్యాహ్నపు భోజనం అక్కడే చేశాం. ఆ బురుజునుంచి చూచినప్పుడు చైనా భద్రత కోసం ఈ అద్భుతమైన గోడను నిర్మించడానికి కావలసిన నిర్మాణ చిత్రాలను సిద్ధంచేసిన ఇంజనీర్లకు, వారి ఆశయాన్ని కార్య రూపంలో పెట్టిన కార్మికులకు జోహారు లర్పించకుండా వుండలేక పోయాం. చిరస్మరణీయమైన గుర్తుగా నే నీ గోడనుంచి మూడు చిన్నరాళ్ళను పడిపోతున్న స్థలంనుంచి సేకరించాను. ఈ రాళ్ళు నాకున్న సంపదలో అపరిమితమైన విలువగల వస్తువులలో ఒక భాగము.

చైనా గోడను గురించి ఒక ప్రేమ గాథ వుంది. దీని నిర్మాణంలో నియోగింపబడ్డ ఒక వడ్రంగి తన ఊరి నుంచి నిర్మాణ ప్రదేశానికిపోతూ చక్రవర్తి ఉద్యానవనంలో విశ్రమించాడు. చక్రవర్తి కుమార్తె అతణ్ణి చూచి మోహించింది. తన్ను వివాహం చేసుకోమని అతన్ని బలవంత పెట్టింది. చైనా గోడ నిర్మాణం ముగిసిన తరువాత తిరిగి వచ్చేటప్పుడు వివాహం చేసుకుంటానని అతడు చెప్పి ఆమెని ఒప్పించి వెళ్ళిపోయాడు. అతడు ఎంతకాలానికీ తిరిగి రాకపోవడంచేత, ప్రియుడికోసం ఎదురుచూచి విసిగి తుదకు చైనా గోడ నిర్మాణం జరుగుతూన్న ప్రదేశానికిపోయి అతణ్ణి గురించి విచారించింది. అతడు గోడ నిర్మాణంలో తన జీవితం కోల్పోయాడని తెలుసుకొని విచారం పట్టలేక అతణ్ణి గురించి ప్రేమగీతాలు పాడుతూ విలపించడం మొదలు పెట్టింది. ఆమె విచారాన్ని, ప్రేమ గాథను విని అంతా వాపోయేవాళ్ళు. ఈ విధంగా ఆమె అహోరాత్రులు తన ప్రియుణ్ణి గురించి తలచుకుంటూ విలపిస్తూండగా, చైనా గోడ విరిగిపోయి తన ప్రియుడున్న స్థలంలో ఆమె విలీనమయింది.

పెకింగ్‌కు 10 మైళ్ళ దూరంలో ఒక కొత్త పారిశ్రామిక నగరం నిర్మింప బడుతోంది. ఇక్కడ ఒక గొప్ప బట్టల ఫ్యాక్టరీ స్థాపింపబడింది. ఇందులో నాలుగు వేల కార్మికులు పని చేయవచ్చు. ఈ మిల్లు ఆధునిక ఆరోగ్య విధానాన్ననుసరించి సమ శీతోష్ణాల కోసరం యంత్రాలు నిర్మించబడి, కాయకష్టం వల్ల పనివారు అలసిపోకుండా వుండేటట్లు నిర్మాణం చేయబడింది. ఈ యంత్రశాలలో పెద్ద పెద్ద ముఖ్య యంత్రాలు కొన్ని తూర్పు జర్మనీలో నిర్మాణం చేయబడ్డాయి. మరమగ్గాలన్నీ చైనా దేశంలోనే నిర్మింపబడ్డాయి. ఇందులో పత్తిని శుభ్రంచేయడం మొదలుకొని, బట్టనేయడంవరకు యంత్రాలన్నీ చైనా కార్మికులే నిర్మించారు. పరిసరాలలో యింకా అనేక మిల్లులు నిర్మించడానికి, ఇతర ముఖ్యమైన కార్ఖానాలు స్థాపించడానికి ప్రయత్నం జరుగుతోంది.

పనివారి నివాసంకోసరం ఆధునిక పద్ధతులతో ఆరోగ్య దాయకమైన గృహాలుకూడా నిర్మాణం చేస్తున్నారు. పని చాల చురుకుగా జరుగుతోంది. 52 వేల కుటుంబాలకు గృహాలు నిర్మించడానికి పూనుకున్నారు. ఇవన్నీ మూడంతస్తుల భవనాలు. వీటిమధ్య ఆట ప్రదేశాలు, క్లబ్బులు, సినిమాశాలలు, ప్రసూతి మందిరాలు, ఆస్పత్రులు, ఈతప్రదేశ శాలలు, బ్యాంకులు, సహకారసంస్థలు, పోస్టు టెలిగ్రాఫు ఆఫీసులు, మార్కెట్లు కూడ నిర్మింపబడుతున్నాయి. అప్పుడే పదివేలమంది కార్మికులు నివసించడానికి యిళ్లు సిద్ధమైనాయి. ఈ కాలనీలో నివసించే కార్మికులకు సకల సౌకర్యాలు లభించేటట్లు యేర్పాట్లు జరుగుతున్నాయి.

ఈ విధమైన కార్మిక నగరాలు, కర్మాగారాలు, మిల్లులు చైనాదేశంలో అనేకం స్థాపింపబడుతున్నాయి. ఈ విధంగా అభివృద్ధి చెందుతూన్న నవచైనా రాజధానిలో అనేక నూత్న నిర్మాణ కార్యక్రమాలను మేము చూచాం. మే 9 వ తేదీన ఉత్తరచైనా (మంచూరియా)లోని మిల్లులకు, ఇతర గొప్పగొప్ప కర్మాగారాలకు, అనేక వృత్తులకు ముఖ్యకేంద్రమయిన ముక్డెన్‌కి మేము ప్రయాణమయాం. అంతర్జాతీయ కార్మిక ప్రతినిధుల ప్రత్యేక రైలులో బయలుదేరాం.

# 5

## జాతీయ పరిశ్రమల పునర్నిర్మాణం

మే 9 వ తేదీ సాయంత్రం 3 గంటలకు మేం ముక్డెన్ పట్టణం చేరాము. రైల్వేస్టేషన్‌లో అంతర్జాతీయ కార్మిక ప్రతినిధు లందరికీ ప్రజలు బ్రహ్మాండమైన స్వాగతం యిచ్చారు. ముక్డెన్ మంచూరియాకు (ఉత్తరచైనా) రాజధానీనగరం. చైనా ముఖ్య పరిశ్రమల కిది కేంద్రం. ఈ రాష్ట్రంలో బొగ్గుగనులు, నూనె, ఎరువుల ఫ్యాక్టరీలు, గొప్ప గొప్ప యంత్ర నిర్మాణశాలలు ఉన్నాయి. చైనాపరిశ్రమలకు, నిర్మాణ కార్యక్రమానికి కావలసిన ఇనుము, ఉక్కు ఇక్కడే ఉత్పత్తి అవుతోంది. అంతేకాకుండా, ప్రసిద్ధిచెందిన షెల్‌నూనె,రాగి, అల్యూమినియం, తగరం మొదలైన లోహ పరిశ్రమలు, కావలసినంత కలపనిచ్చే మహారణ్యాలు ఉత్తర చైనాలో విరివిగా వున్నాయి.

ఈ రాష్ట్రాన్ని 1931 వ సంవత్సరంలో జపాన్ ఆక్రమించు కుంది. ఇక్కడి పరిశ్రమలను, ఫ్యాక్టరీలను కృంగదీసి, ముడిసరకులను ఎగుమతిచేసి, తన దేశ పరిశ్రమాభివృద్ధికి ఆంగ్లప్రభుత్వం భారత దేశాన్ని వినియోగించుకున్నట్లు చేసుకుంది. 1946 వ సంవత్సరంలో ముక్డెన్ పరిశ్రమలన్నీ కొమింటాంగ్ యాజమాన్యంలోకి వచ్చాయి. లంచగొండితనానికి, పెట్టుబడిదారుల దోపిడీ విధానానికి, అవినీతికి, అసమర్థతకు పేరుపడ్డ ఆ ప్రభుత్వ యాజమాన్యంలో పరిశ్రమలన్నీ క్షీణించిపోయాయి. 1948 వ సంవత్సరంలో మంచూరియా విముక్తి

పొందడంతో, ఈ పరిశ్రమలన్నీ నవచైనా ప్రభుత్వానికి వశమైనాయి. దీనితో ఈ పరిశ్రమలకు, కార్మికవర్గానికి నూతన జీవితం ప్రారంభమయింది. ముక్డెన్ పట్టణ ప్రస్తుత జనాభా 23 లక్షలు.

ఇక్కడ 1936 వ సంవత్సరంలో మైలుతుత్తం, తుత్తునాగం మొదలయిన రసాయనాలు తయారుచేసే ఫ్యాక్టరీని జపాన్ పాలకులు నిర్మించారు. ఇదికూడ 1946 వ సంవత్సరంలో కొమింటాంగ్ ప్రభుత్వం ఆధీనంలోకి వచ్చింది. కొమింటాంగ్ పాలకులు ఈ ఫ్యాక్టరీని ఉపయోగం చేసుకోడం చేతగాక మూసివేశారు. ఈ పరిశ్రమలోని కార్మికులందరూ తమ జీవితాలకు నీళ్ళు వదులుకోవలసి వచ్చింది. నవచైనా ప్రభుత్వం 1949 వ సంవత్సరంలో ఈ ఫ్యాక్టరీని తెరచి, యంత్రాలను బాగుచేసి, వెళ్ళిపోయిన కార్మికులను మళ్ళీ తెప్పించి, ఈ పరిశ్రమను ఉద్ధరించారు. పరిశ్రమలోని ఉత్పత్తితోపాటు కార్మికుల వేతనాలు జీవిత ప్రమాణాలు కూడ అభివృద్ధి పొందాయి. ఈ పరిశ్రమ కొరియా యుద్ధ విజయానికెంతో తోడ్పడింది. ఇక్కడి కార్మికులు "ఫ్యాక్టరీ మన యుద్ధభూమి, యంత్రాలే మన ఆయుధాలు" అనే నినాదం తీసుకున్నారు.

ముక్డెన్‌లో గొప్ప యంత్రనిర్మాణశాల వుంది. గనులలో ఉత్పత్తికి వినియోగించే చిన్నచిన్న యంత్రాలను జపాన్ అధికారులు ఇక్కడ తయారుచేస్తూ వుండేవారు. రైల్వే ఇంజన్‌లకు వలసిన వస్తు సామాగ్రినికూడ ఇక్కడ తయారు చేసేవారు. కొమింటాంగ్ పాలనలో ఈ ఫ్యాక్టరీకూడ నిద్రపోయింది. 1949 లో నవచైనా ప్రభుత్వం దీన్ని తిరిగి నెలకొల్పింది. ఈ యంత్రనిర్మాణ కర్మాగారంలో లేత్, మిల్లింగ్, బోరింగ్, ప్లేనింగ్, డ్రిల్లింగ్ యంత్రాలన్నీ తయారవుతున్నాయి. ఇక్కడ కార్మికుల వేతనాలు 1949 వ సంవత్సరంలో కంటె 1953 లో నూటికి నలభైపాళ్లు హెచ్చయినాయి. ఈ అభివృద్ధికితోడు ప్రతి కార్మికుడు తన వ్యక్తిగత ఉత్పత్తి ననుసరించి బోనసుకు అర్హు

డౌతున్నాడు. ఈ బోనసు సగటున ప్రతి కార్మికుడి వేతనంలో నూటికి 67 పాళ్ళ వరకు నూరుకుతోంది. ఒకప్పుడీ ఫ్యాక్టరీలో మామూలు కార్మికుడుగా వుండిన వాంగ్-వాన్-షన్ నేడు దీనికి డైరెక్టరు.

ఈ పారిశ్రామిక కేంద్రంలో కార్మికుల వసతికోసరం 48 వేల గృహాలు నిర్మించడానికి పని కొనసాగుతూంది. గత రెండు సంవత్సరాలలో 4800 గృహాలు సిద్ధమయినాయి. ఈ ఫ్యాక్టరీలలో యెంతోమంది స్త్రీలు పురుషులతో పాటు యంత్రాలమీద పనిచేస్తూ వున్నారు. వాళ్ళంతా శక్తిసామర్థ్యంలో, పనితనంలో పురుషుల కేమాత్రము తీసిపోవడంలేదు. మేము వెళ్ళిన ప్రతి ఫ్యాక్టరీలోను కార్మికులు, ప్రజలు మాకు హృదయపూర్వకంగా స్వాగతాలిచ్చి ప్రేమతో ఆదరించారు.

ముక్డెన్ పారిశ్రామిక ప్రదర్శనభవనంలో, మంచూరియాలో ఉత్పత్తి అయ్యే వస్తుసముదాయ ప్రదర్శనం జరుగుతూ వుండింది. ఈ ప్రదర్శనలు కార్మికుల మానసికవికాసానికి, తమశక్తి సామర్థ్యాలను గుర్తించడానికి, దేశాభివృద్ధికి, ఆర్థిక విధానానికి వీరు చేసే ఉత్కృష్టసేవను ప్రజలు గుర్తించి గౌరవించడానికి ఉపయోగపడుతున్నాయి. కార్మికులు ఆత్మచైతన్యాన్ని పొంది, తమ ప్రాముఖ్యతను గుర్తించి యింకా అభివృద్ధిపొందడాని కీ ప్రదర్శనలు ప్రోత్సాహకరంగా వున్నాయి. ఈ ప్రదర్శనంలో మంచూరియాలో తయారయ్యే వివిధలోహాలు, యంత్రాలు, పత్తి, వస్త్రాలు, సిల్కు, రబ్బరు. పింగాణి, పోర్సిలెన్, నూనె, బొగ్గు మొదలయిన వివిధ పరిశ్రమలలో ఉత్పత్తి అయిన వస్తుసముదాయ మంతా ప్రదర్శింపబడుతోంది. ఏ యే సమయంలో ఏవిధమైన అభివృద్ధి పొందినదీ సూచించే గ్రాఫ్‌లున్నాయి. అభివృద్ధికి తోడ్పడే నూతన విధానాలను కనిపెట్టినవారు, పనిలో అభివృద్ధి చూపినవారు, ఉత్పత్తివిధానంలో ఖర్చులు తగ్గడానికి అభిప్రాయలిచ్చినవారు మొదలయిన కార్మికుల పట్టీలుకూడ యిందులో ప్రదర్శింపబడ్డాయి.

మే 11 వ తేదీని మేము ముక్డెన్ పట్టణంనుంచి 15 మైళ్ళ దూరంలో వుండే కావ్-కన్-చన్ అనే గ్రామానికి వెళ్లాము. ఆ గ్రామపంచాయితీ అధ్యక్షుడు చన్-చన్-ఫాన్ మాకు స్వాగత మిచ్చాడు. ఈ గ్రామంలో 160 కుటుంబాలు నివస్తున్నాయి. గ్రామానికంతా కలిసి మొత్తం 2443 మావ్ ల పొలంవుంది. (1 మావ్=1/6 వంతు యకరం) కొమింటాంగ్ పాలనలో ఈ పొలాలలో నూటికి 92 పాళ్లు భూస్వాము లాక్రమించుకునేవారు. పేదరైతులు, కూలీలు కూటికి గుడ్డకు లేక అల్లాడుతుండేవాళ్లు. ఈ గ్రామంలో సాముదాయిక పద్ధతిమీద వ్యవసాయం జరుగు తోంది. (Collective farming). జపాన్ పరిపాలనలో పంట పండినా పండకపోయినా సాగుబడి చేసే రైతులు భూస్వామికి 30 పిక్కుర్ల ధాన్యం, జపాన్ ప్రభుత్వానికి పన్నుక్రింద ఆరుపిక్కుర్ల ధాన్యం చెల్లింపవలసివచ్చేది. ఈ విధానంలో వ్యవసాయదారు యజమానికి ప్రభుత్వానికి కలిసి పండించిన పంటకంటె రెండు రెట్లు అర్పించుకోవాలి.

పరాధీన కాలంలో మావ్ ఒక్కింటికి 220 కట్టీల ధాన్యం (1 కట్టీ =1/10 పౌనులు) పండేది. మంచూరియా విముక్తి చెందిన తరువాత 1950 లో మావ్ కి 440 కట్టీలు, 1952 వ సంవత్సరంలో 550 కట్టీలు, 1953 సంవత్సరంలో 678 కట్టీలు ధాన్యం పండుతోంది. సమిష్టి వ్యవసాయ విధానంవల్ల, అభివృద్ధికరమైన విధానాలవల్ల ట్రాక్టర్లను వినియోగించి భూమినిదున్ని, ఎరువులతో సారవంతం చేయడంవల్ల పంట యించుమించు నాలుగు రెట్లకు పెరిగింది. ఈ గ్రామంలో ఒక ప్రాథమిక పాఠశాల, ఒక సహకార సంస్థ వున్నాయి. పాతకాలంలో చదువు సంధ్యలు లేక పొలాలమీద తిరుగుతూ, పోకిరీ జట్టులలో కలిసే పిల్లలంతా యిప్పుడు బడికిపోయి విద్యావంతులవుతున్నారు. లెక్కలను బట్టి యిదివరకు పిల్లలు నూటికి 70 మంది చదువుకునే అవకాశం లేక

శుంఠలయ్యేవాళ్ళు. ఇప్పుడు పిల్లలందరికీ విద్యాభ్యాసానికి అవకాశం కల్పించబడటంవల్ల అంతా చదువుకుంటున్నారు.

ఈ గ్రామం భారతదేశంలోని మన గ్రామాలలాగే వుంటుంది. ఇందులో కొన్ని పెంకుటిళ్లు, కొన్ని పూరిగుడిసెలు. ఆదరణలోకూడ వీరు మన గ్రామస్థులనే పోలియున్నారు. ప్రతినిధులందరికీ ఉడకబెట్టిన కోడిగుడ్లు, వేరుశనగకాయలు, చైనాటీతో ఆతిథ్యమిచ్చారు. గ్రామవాసులంతా సిరిసంపదలతో తులతూగడం లేదుకాని, తిండికి బట్టకు లోపం లేకుండా జీవితం గడుపుతున్నారు. వీళ్ళ ఆహారంలో పందిమాంసం చాలముఖ్యమయింది. ఇది చాల విరివిగా వాడబడుతుంది. గ్రామీణ కుటుంబాలు కొన్ని పందుల్నీ, కోళ్ళనీ పెంచుతూంటారు. ఒక పెద్ద రాతి తిరగలితో పిండి విసురుకుంటారు. తిరగలిమీద రాయికి కాడికట్టి మనుష్యులైనా తిప్పుతారు; లేకపోతే గాడిదనైనా ఉపయోగిస్తారు. చైనాలో పశుసంపద తక్కువగాఉంది. ఈ గ్రామంలో సమిష్టి వ్యవసాయంకోసరం కొన్ని గుఱ్ఱాలు, గాడిదలు ఉన్నాయి. ఇవన్నీ ఏ వ్యక్తికో చెందకుండా గ్రామానికంతటికీ చెందివున్నాయి.

మంచూరియాలో బొగ్గు గనులు అన్ని పరిశ్రమలకంటె ప్రాముఖ్యత వహిస్తున్నాయి. వీటికి ఫ్యూషన్ గనులని పేరు. విప్లవకాలంలో యీ పరిశ్రమ చాలా దెబ్బతినింది. జపాన్ దుండగులు, కొమింటాంగ్ కృతఘ్నులు ఓడిపోయి పారిపోతూ యీ గనులను చాలావరకు నాశనం చేశారు. గనుల నన్నిటినీ నీటితో నింపి ఉత్పత్తికి విఘాతం కల్పించారు. ఈ పరిశ్రమ నాధారం చేసుకొని ఎన్నో యితర పరిశ్రమలు మంచూరియాలో అభివృద్ధి పొందుతున్నాయి. విముక్తి కాలం నాటికి ముక్డెన్ జనాభా మూడు లక్షలకు పడిపోయింది. ప్రజలు చలికాలంలో దేహాలను కాపాడుకోవడానికి తగిన వస్త్రాలు లేక అల్లాడిపోయేవాళ్లు. కలరా, మశూచి వగైరా రోగాలకు ముక్డెన్ స్థావరమై పోయింది. విముక్తి తర్వాత పరిశ్రమ లొక్కొక్కటే పని ప్రారంభించాయి. జనసంఖ్య 6 లక్షల

50 వేలకు పెరిగింది. కార్మికుల సంఖ్య రెండింతలు పెరిగింది. 1940 వ సంవత్సరంలో ఉత్పత్తి 100 అనుకుంటే 1953 వ సంవత్సరంలో 624 వరకు అభివృద్ధి పొందింది. ఉత్పత్తి ఖర్చు నూటికి 58 పాళ్లు తగ్గింది. కార్మికులసంఖ్య 1949 వ సంవత్సరంకంటె నాలుగున్నర రెట్లు హెచ్చింది. ప్రమాదకరమైన ఉత్పత్తివిధానాలకు స్వస్తి చెప్పబడి ఆధునిక విధానాలతో ప్రారంభమయింది. కార్మికులలో యెంతోమంది ముఖ్య పదవులలో నియోగింపబడి బాధ్యత వహిస్తున్నారు. గనులలో ప్రమాదంవల్ల మరణించేవారి సంఖ్య పూర్తిగా రూపుమాసిపోయింది. కార్మికుల వేతనాలలో 1949 వ సంవత్సరంకంటె 1950 వ సంవత్సరంలో నూటికి 69½ పాళ్లు అభివృద్ధి కలిగింది. చైనా కార్మికులందరిలోకి గనులలో కార్మికుల వేతనాలు యెక్కువగా ఉన్నాయి. వీరి పరిశ్రమ చాలా కష్టంతోను ప్రమాదంతోను కూడుకొని వుండడంవల్ల వేతనాలుకూడ వీరి బాధ్యత ననుసరించి నిర్దేశింపబడ్డాయి. బొగ్గుగనులలో సగటున ఒక కార్మికుడి వేతనం 20 లక్షల యెన్నులవరకువుంది (అయిదు వేల యెన్నులు ఒకరూపాయకు సమానం). ఇతర కార్మికుల వేతనాలు వారి వారి బాధ్యతల ననుసరించి 9 లక్షల యెన్నులనుంచి 15 లక్షల యెన్నులవరకు వుంది.

కార్మికవర్గానికి వృద్ధాప్యంలో పెన్షనులు, ప్రమాదాలవల్ల గాయపడినా మరణించినా పరిహారమూ, జబ్బుపడినప్పుడు చికిత్స యేర్పాటులు, సెలవులు మొదలయిన హక్కులున్నాయి. కార్మికుల సౌకర్యార్థం 9 విశ్రాంతి మందిరాలు, 85 ఆస్పత్రులు, 63 సహకార సంస్థలు, 64 చౌక భోజనశాలలు, 2 కెండర్ గార్డెన్ బడులు, 95 పిల్లల బోర్డింగులు, 14 మిడిల్‌స్కూళ్లు, 322 ప్రైమరీ బడులు, 35 వయోజన విద్యాకేంద్రాలు వున్నాయి. గత రెండు సంవత్సరాలలో 15500 మంది కార్మికులు విద్యావంతులయ్యారు. 27 వేలమంది కార్మికులు వృత్తివిద్యల్లో ఉత్తీర్ణులయ్యేటందుకు విద్య నేర్చుకొంటున్నారు. 66 లైబ్రరీలు, విజ్ఞాన

కేంద్రాలు, 24 పెద్ద క్లబ్బులు, 68 చిన్న క్లబ్బులు ఉన్నాయి. 14 నృత్యనాటక మందిరాలు, 180 క్రీడాజట్టులుకూడ ఉన్నాయి.

ఫ్యూషన్ బొగ్గుగనులలో ఉత్పత్తి 1914 వ సంవత్సరంలో ప్రారంభమయింది. ఇవన్నీ నేలసొరంగాలు కాక పైనుండి కాలవల్లా త్రవ్వబడ్డవి. ఇవి 6600 మీటర్ల నిడివి, 1500 మీటర్ల వెడల్పు, 190 మీటర్ల లోతు గలిగివున్నాయి. ఈ గనుల పైభాగంలో షెల్ నూనెకు అవసరమైన రసాయన పదార్థం వుంది. ఇది బొగ్గులాగు నల్లరంగులో కాకుండా కొంచెం నీలిరంగులో వుంటుంది ఇది బొగ్గులా ఘనపదార్థం. అడుగుభాగంలో బొగ్గు ఉంటుంది. నీటిఅడుగునకూడ బొగ్గు త్రవ్వబడుతోంది. అది సొరంగాలద్వారా బయటకు తెస్తారు. బొగ్గు షెల్ రసాయనం కొంత యంత్రాల వల్ల, కొంత మనుష్యులవల్ల త్రవ్వబడుతోంది. మనదేశంలోలాగే యీ గనులలో 8 గంటల చొప్పున కార్మికులు మూడు షిఫ్టులలో పనిచేస్తున్నారు. ఇక్కడ కార్మికుల వసతికోసరం సినిమా శాలలు, స్నానమందిరాలు, ఇండ్లు మొదలయినవి నెలకొల్ప బడ్డాయి. బొగ్గుగనులలో పనివాళ్లుండే యిళ్ళు, కొత్తగూడెం పని వాళ్ళ యిండ్లమాదిరివికూడ వున్నాయి.

షెల్ ఆయిల్ఫ్యాక్టరీలో నూనెతోపాటు ఎరువులు, నవాసాగరం, పెట్రోలు, కిరసిన్‌నూనె, డీసెల్‌నూనె మొదలయినవి కూడ ఉత్పత్తి చేస్తున్నారు. వీటి ఉత్పత్తికి కావలసిన ముడిసరుకులు ఫ్యూషన్‌గనులనుండే దొరుకుతాయి.

ముక్డెన్‌పట్టణంలో గొప్ప రైల్వే వర్కుషాపుకూడ వుంది. ఇందులో ఇంజన్లు, కోచీలు, వాగన్లు మరమ్మత్తు చేయబడుతాయి. ఈ వర్కుషాపు 1928 వ సంవత్సరంలో స్థాపింపబడింది. 1931 లో దీన్ని జపానాక్రమించుకుంది. 1946 నుండి, '48 వరకు చాంగ్‌కైషేకు ప్రభుత్వాధీనమయింది. ఈకాలంలో ఈ వర్కుషాపు చాల వరకు నాశనం చేయబడి, 1948 వ సంవత్సరంలో నవచైనా

ప్రభుత్వానికి వశమయింది. నవచైనా ప్రభుత్వం క్రింద ఈ వర్కుషాపు చాల మార్పు చెందింది. కార్యవిధానంలో అభివృద్ధికరమైన మార్పులు తెచ్చి, కార్మికులలో దేశభక్తిని ప్రబోధించి, వాళ్ళలో ఉత్సాహం రేకెత్తించినందువల్ల 1949వ సంవత్సరం కంటె 1953వ సంవత్సరంలో నూటికి 82 పాళ్ళు యెక్కువపని లభించింది. ప్రతి కార్మికుడు అభివృద్ధికరమైన పనితనం నేర్చినందున, మంచి పని ముట్లు వాడుతున్నందున పాతకాలంకంటె అయిదురెట్లెక్కువగా పనిచేయగలుగుతున్నాడు. కార్మికుల వేతనాలలో 1949వ సంవత్సరంకంటె నూటికి 71 పాళ్లు వృద్ధిచేయబడింది. ఇంజన్లను, కోచీలను, వాగన్లను మరమ్మతు చేయడంలో సోవియట్ విధానాన్ని అనుసరిస్తున్నారు. ఎంతో మంది సోవియట్ కార్మిక నిపుణులు చైనాపనివారికి తమ పద్ధతులమీద పని నేర్పారు.

ఈ వర్కుషాపులో 120 మంది ఆదర్శ కార్మికులు, 20 ఆదర్శ పనివారిజట్లు వున్నాయి. ఎంతోమంది సామాన్య కార్మికులు బాధ్యతగల పదవులలో నియోగింపబడ్డారు. విముక్తి చెందిన తరువాత యీ వర్కుషాపులో 500 కార్మికులు వివిధశాఖలలో అధికార పదవులకు నియమింపబడ్డారు. వర్కుషాపు పరిసరంలో రెండు వయోజన విద్యాశాలలున్నాయి. 500 మంది కార్మికులందులో విద్యాభ్యాసం చేస్తున్నారు. కార్మికులకోసరం సినిమా శాల, క్లబ్బు వున్నాయి. రాత్రిపూట పనివారి విశ్రాంతికోసరం విశ్రాంతి గృహాలున్నాయి. పిల్లల సంరక్షణకోసరం నర్సరీలున్నాయి. స్త్రీ కార్మికుల ఆరోగ్య సంరక్షణకోసరం ప్రత్యేక చికిత్సాలయం వుంది. 1949వ సంవత్సరం కంటె 1953వ సంవత్సరంలో కార్మికుల ఇన్‌షూర్యాన్సు ఫండు నాల్గురెట్లవరకు పెరిగింది. జబ్బుపడిన కార్మికులకు సెలవు, చికిత్స, భోజన సదుపాయా లున్నాయి. స్త్రీ కార్మికులకు ప్రసూతిమందిరా లున్నాయి.

రైల్వే వర్కుషాపులో నాకుగల అనుభవాన్నిబట్టి, ముక్డెన్ రైల్వేవర్కుషాపులో యేమీ ప్రత్యేకత కనిపెట్టలేకపోయాను.



డైరెన్‌లో (ఈశాన్య చైనా) రైల్వే కార్మికుల ఆసుపత్రి. ఇందులో మంచాల సంఖ్య 1950 లో 4598; 1953 లో 8272.



షాంఘై నగరంలో స్త్రీలు మాత్రమే నడిపే ప్యాసింజరు రైలు.
స్త్రీ కార్మికులు తమ తమ పనుల్లో ప్రవేశిస్తున్న దృశ్యం.

ఇంజన్లు, కోచీలు, వాగన్ల మరమ్మతు మనదేశంలో జరిగినట్లే జరుగుతుంది. కాని విశిష్టత యేమంటే, అక్కడ ప్రతికార్మికుడు ఒక నిమిషమయినా కాలాన్ని వ్యర్థం చేయడు. కష్టపడి పనిచేయడంలో భారత రైల్వే కార్మికునికంటే రెండుమూడురెట్లు ఎక్కువ. తెలివితేటలలో చైనా కార్మికుడు భారత కార్మికునికంటె అధికుడు కాడు కాని, కష్టపడి శరీరంవంచి పనిచేయడంలో అతనికి ఆధిక్యత వుంది. అందుకు కారణం అక్కడి కార్మికులపట్ల ప్రభుత్వం చూపుతున్న శ్రద్ధ.

శ్రీ సిబ్బన్‌లాల్ సక్సెనా, నేనూ ముక్డెన్ మెడికల్ కాలేజి చూడడానికి వెళ్ళాం. కాలేజి యూనియన్ కార్యదర్శి మాకు స్వాగతమిచ్చాడు. కొమింటాంగు సైనికదళాలు పారిపోతూ ఈ కాలేజీలోని పరికరాలు, యంత్రాలు విరగగొట్టి నాశనంచేసి పోయారని, కాలేజీకి సంబంధించిన ఆస్పత్రిలో చికిత్సకు ఉపకరించే పరికరాలను ధ్వంసం చేశారని చెప్పాడు. ఈ కాలేజీలో సోవియట్ వైద్యవిధానం అమలు జరుగుతోంది. పుస్తకాలుకూడ రష్యన్ పుస్తకాలే వినియోగింపబడుతున్నాయి. ఇంగ్లీషుభాష స్థానాన్ని రష్యన్‌భాష ఆక్రమిస్తున్నట్లు తోస్తుంది. కాలేజీ పుస్తక భాండాగారంలో చాలవరకు రష్యన్ వైద్య గ్రంథాలున్నాయి. జర్మనీ, ఇంగ్లీషు, ఫ్రెంచి గ్రంథాలు కూడ విరివిగా వున్నాయి కాని, అవి కేవలం రిఫరెన్సు గ్రంథాలు.

వైద్యశాస్త్రంలోను, రసాయనిక శాస్త్రంలోను సోవియట్ గ్రంథాల కింత ప్రాముఖ్యత ఈయడం, వారి విధానానికే ప్రాశస్త్య మీయడం కొంత సంకుచితదృష్టిని సూచించదా అని నేను సెక్రటరీని ప్రశ్నించాను. చికిత్సా విధానంలో యెందరో నిపుణులు అమెరికా, జర్మనీ మొదలయిన దేశాలలో కూడ వున్నారనీ, వారి అనుభవాన్ని, ప్రజ్ఞనూ, మానవ అభ్యుదయానికి వాడుకోడంవల్ల నష్టమేమనీ ప్రశ్నించాను. జవాబు చెప్పడాని కతడు కొంచెం వెనుక ముందు ఆలోచించాడు. తరువాత అభివృద్ధికి, మానవ

సౌఖ్యానికి ఉపయోగపడే అనుభవము, విజ్ఞానము యెక్కడనుంచి వచ్చినా దాన్ని ఉపయోగించుకోడానికి అభ్యంతరం వుండకూడదనీ, తాము అవసరమయినప్పుడు వారి అనుభవంవల్ల లాభం పొందడానికి యత్నిస్తున్నామని చెప్పాడు. అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి, సామ్రాజ్యతత్వాన్ని బహిష్కరించి, ఆ దేశస్తులలో వుండే ఉత్కృష్టతను విశాల హృదయంతో అవగాహన చేసుకొని, వాటి వల్ల లాభం పొందాలని అతడు నవ్వుతూ చెప్పాడు.

వైద్యకళాశాలకు మేము వెళ్ళినప్పుడు అక్కడ ఒక శవ పరీక్ష జరుగుతోంది. ఉదారస్వభావుడైన ఒక వీరుడు మరణిస్తూ, తా ననుభవించిన రోగంయొక్క నిజతత్వాన్ని గుర్తించి ప్రతిక్రియ లాలోచించేటందుకు తన దేహాన్ని దానంచేశాడు. ఒక నిపుణుడు అతడి దేహంలోని ముఖ్యాంగమయిన హృదయాన్ని చీల్చి గుండెను, ఊపిరితిత్తులను బయటకుతీసి ఏకాగ్రతతో పరీక్షిస్తూ యెదుటవుండే శస్త్ర వైద్యులకు, ప్రొఫెసర్లకు ప్రదర్శిస్తున్నాడు. మేముకూడ చూడడానికి అనుమతి వేడాము. ఎటువంటి కష్టం లేకుండా మాకూ అనుమతి దొరికింది. మా వెంట ఇటాలియన్ డాక్టరొకాయన, కార్మిక ప్రతినిధిగా వచ్చిన అతను కూడా వున్నాడు. కొన్ని నిముషాలు చూసిన తరువాత తిరిగి వచ్చాము. సహజంగా డాక్టర్లు కానివారికి, విద్యార్థులు కాని వారికి అటువంటి స్థలానికి ప్రవేశార్హత ఉండదు. అయినా మా కోరికను నిరాకరించకుండా మాకు అనుజ్ఞనిచ్చారు.

ఈ వైద్యకళాశాలలో ప్రకృతి చికిత్సకూడ బోధింపబడుతుంది. మట్టితోను, వేడినీటితోను, చన్నీటితోను పట్లు వేయడం, స్నానం చేయించడంవల్ల కొన్నిరోగాలకు ఉపశమనం జరుగుతుందని తెలిపారు.

మేమువేసే ప్రశ్నలు ఒక్కొక్కప్పుడు సమాధానమిచ్చే వారికి చాల కష్టంగా వుండేది. ఒక్కొక్కప్పుడు కోపకారణం కూడా కావచ్చు. అయినా యెంతో ఓపికతో, నమ్రతతో ఎన్ని

సారులడిగినా జవాబులిచ్చి సంతృప్తి పరచడానికి యత్నం చేసేవారు.

ముక్డెన్‌లో మూడు నాల్గు రోజులుండి హువాయ్‌నదీ ప్రాజెక్టు లందొకటైన ఫుట్సులింగ్ ప్రాజెక్టుకు వెళ్ళాం.

# 6

## హువాయ్ నదీ ప్రాజెక్టులు

వు-హైన్ నుంచి మే 14 వ తేదీన మేము బయలుదేరి 15 వ తేదీన హోపే చేరాం. ఇక్కడకూడ అంతర్జాతీయ కార్మిక ప్రతినిధులకు తక్కిన ప్రదేశాలలోలాగే స్వాగతంఈయబడింది. హోపే నుంచి హువాయ్ నదీ ప్రాజెక్టులలో ఒకటయిన పుట్సులింగ్ ప్రాజెక్టును చూడడానికి వెళ్ళాం. ఇంచుమించు 120 మైళ్ళ దూరం బస్సులలో ప్రయాణం చేయవలసి వచ్చింది. దారిలో మా అందరి విశ్రాంతికి, భోజనానికి సదుపాయం చేయబడింది. సాయంత్రం ప్రొద్దుగూకేవేళకు పుట్సులింగ్ చేరగలిగాం. పుట్సులింగులో హువాయ్ నదికి ముఖ్యఉపనది అయిన బీనదికి డాము కట్టబడింది. క్రిందటిరాత్రి విపరీతమైన వర్షం కురిసింది. నదిలో నీరు ఉరవడితో ప్రవహిస్తోంది. పుట్సులింగు డాముపని పూర్తికావస్తోంది. అందువల్ల వరదనీటిని అరికట్టి నదిని దాటడానికి నిర్మాణం చేయబడ్డ కట్టెవంతెనమీదనుంచి మాబస్సులు దాటింపబడ్డాయి. హువాయ్ నదీ ప్రాజెక్టులు ప్రారంభం కాకముందు యిటువంటి వరదలు వచ్చినప్పుడంతా కొన్నిరోజులవరకు నదిని దాటడానికి వీలయ్యేది కాదు. ఈ కష్టానికితోడు ఎన్నో యిళ్ళు, వాకిళ్ళు కొట్టుకొని పోయేవికూడా.

చైనా మహానదులలో యాంగ్సీ, ఎల్లో నదుల తరువాత హువాయ్ నది చాల ముఖ్యమైనది. ఈ మహానదికి దక్షిణాన

యాంగ్సీ, ఉత్తరాన ఎల్లోనదులు ప్రవహిస్తున్నాయి. ఈ మహానది పెకింగ్ దగ్గర వుండే టుంగ్ పో పర్వత శిఖరాల్లో పుట్టి, అనేక యెగుడు దిగుడు ప్రదేశాలలో పరుగిడుతూ, హోనాన్, అన్ హ్వ్యాయ్, క్యైంగ్సో రాష్ట్రాలగుండాపోతూ ఎల్లో సముద్రంలో కలుస్తుంది. ఈ మహానదిలో పది గొప్ప ఉపనదులు, ఎన్నో వాగులు కలుస్తాయి.

హువాయ్ నది సహజంగా ఒడుదుడుకులు లేకుండా మన దేశంలో గోదావరిలాగు ప్రశాంతమైన నదిగా వుండేది. ఇది చాల లోతయి, ఓడ ప్రయాణానికి సుకరంగా వుండేది. తన నమ్రతవల్ల ఇది చైనా దేశంలో "నవోఢ" (యంగ్ మెయిడ్) అనే పేరు సంపాదించింది. అయినా దీని ఉపనదులు కొన్ని జులై, ఆగస్టు మాసాలలో విపరీతంగా పొంగి, వరదలకు కారణమవుతూ వుంటాయి. ఈ వరదలవల్ల జనానికి, పంటలకు విపరీతమైన నష్టం వాటిల్లుతూ వుండేది. హువాయ్ నది వరదలవల్ల కలిగే నష్టాలు మన దేశంలో కోసీ, బ్రహ్మపుత్రానదుల వరదలను మించిపోయేవి. 1931 సంవత్సరపు వరదలలో ఈ నది 14 కోట్ల 70 లక్షల మావ్ ల విస్తీర్ణంగల పంటపొలాలను ముంచివేసింది. అయిదుకోట్ల జనం ఇళ్లు వాకిళ్లు కోల్పోయారు. ఎన్నో లక్షలమంది వరదలకు తమ జీవితాల నాహుతిచేశారు. 1950 వ సంవత్సరంలో యిటువంటిదే యింకో వరదవచ్చి నానాబీభత్సాలు కల్పించింది.

హువాయ్ నది యెంత భీకరమయిందో అంత పురాతనమైనదికూడ. గత రెండువేల రెండువందల సంవత్సరాలలో యిది 973 సార్లు పొంగి గొప్ప వరదలను తెచ్చి మహోపద్రవాలను కల్పించింది. ప్రతి పదిసంవత్సరాలకు ఒకసారి విపరీతంగా పొంగడమూ, సంక్షోభాలను కల్పించడమూ పరిపాటి. హువాయ్ నదిని అదుపులోకి తెచ్చేందుకు, దాని ప్రాజెక్టులవల్ల చైనాలో అయిదుకోట్ల జనానికి తిండికొరత తీర్చేందుకు అవకాశం వుంది. ప్రజాక్షయానికి, విపరీతమైన పంటల నష్టానికి కారణమవుతూవుండే

యీ నదియొక్క నిరంకుశ ప్రవాహాన్ని అరికట్టడానికి 1951 వ సంవత్సరం జులై నెలలో నవచైనా ప్రభుత్వం కృషి ప్రారంభించింది.

రెండు వందల ఉపనదుల్ని తనలో విలీనం చేసుకుంటూ, 680 మైళ్ళు ప్రవహించే యీ నది నీటివల్ల 17 కోట్ల 15 లక్షల మా్ల భూమిని సాగుబడి క్రిందికి తెచ్చి, అయిదుకోట్ల జన సామాన్యం యొక్క ఆర్థికస్థితిని మెరుగుపరచి, వారికి తిండి బట్ట కొరత లేకుండా చేయడానికి నవచైనా ప్రభుత్వం పూనుకుంది.

సుంగ్ రాజవంశజుల పరిపాలనలో యీ నది నిరుపద్రవంగా వుండేది. దీనివల్ల ఎన్నో చెరువులకు నీరు దొరికి వ్యవసాయానికి ఉపకరించేది. 1194 వ సంవత్సరంనుంచి ఈ నది తన గమనాన్ని మార్చుకొని, ఎల్లోనది సాంగత్యంతో విపరీత వర్తనకు దిగింది. సుంగ్ రాజవంశంనుంచి చింగ్ చక్రవర్తుల వరకు చైనాను పరిపాలించిన ప్రభుత్వాలేవీ దీని నిరంకుశత్వాన్ని అరికట్టడానికి ప్రయత్నంచేయలేదు. ఈ నిరంకుశ ప్రభుత్వాల పాలనలో నదీతీరంలోని చెట్లను కలపకు, వంట చెరుకుకు నరికివేయడంవల్లనూ దీనికి సంబంధించిన చెరువులు, కుంటలు పూడ్చింపబడి, వాటి స్థానంలో జమీందారులు పొలా లేర్పరుచుకోడంవల్లను, బీద జన సామాన్యానికీ నది వల్ల కలిగే లాభాలు నశించాయి. విపరీతమైన నష్టాలు వాటిల్లడం ప్రారంభమయింది.

నిరంకుశ విధానానికి, స్వార్థపరత్వానికి పేరుపడ్డ చక్రవర్తుల దుష్పరిపాలనలో, వాళ్ళ స్వార్థంకోసరం, సౌఖ్యంకోసరం ప్రజలకష్టాలను సరకుచేయకుండా త్రవ్వించిన పెద్ద పెద్దకాల్వలవల్ల, తరువాత ఈ నది పొంగకుండా ఆ కాలువ గట్లను విపరీతంగా పెంచడంవల్ల హువాయ్‌నది సహజప్రవాహాని కడ్డులేర్పడి వరదలకు తావుకలిగింది.

ఒక వంద సంవత్సరాలనుంచి తన గతిని మార్చిమార్చి ఏదో ఒక స్థిరగమనాని కలవాటుపడ్డ హువాయ్‌నది గట్లను 1938 వ సంవత్సరంలో చాంగ్‌కై షేక్ వెనకముందు లాలోచించ

కుండా, ప్రజలకు కలిగే అపారమైన నష్టాలను, కష్టాలను లెక్క-చేయకుండా, విప్లవసైన్యాలదాడి నరికట్టేఉద్దేశంతో తెగగొట్టించి, విపరీతమైన వరదల్ని కల్పించాడు. దీని ఫలితంగా ఒకకోటీ నలభై లక్షల మావ్‌ల విస్తీర్ణంకలిగి, సాగుబడిలోవుండే ప్రదేశమంతా సుస్థిరంగా నీటిలో మునిగిపోయింది. హటాత్తుగా వచ్చిన యీ వరదలలో అయిదులక్షల జనం చాంగ్‌కైషేక్ అవివేకంవల్ల మృత్యువాత పడ్డారు. ఇంకో అయిదులక్షల జనం ప్రాణాలను దక్కించుకొని, వేరే ప్రదేశాలకు ప్రవాసం పోయారు. చాంగ్‌కైషేక్ విపరీత విధానంవల్ల హువాయ్‌నదీ ప్రాంతంలోని పల్లపు ప్రదేశమంతా నాశనమయి పోయింది. అయినా చాంగ్‌కైషేక్ ప్రభుత్వం హువాయ్ నదీప్రవాహాన్ని అదుపులోకి తేవడాని కేటు వంటి యత్నమూ చేయలేదు.

1950 వ సంవత్సరపు వరదలవల్ల ప్రజలుపడ్డ పాట్లను చూచి, ఇకముందు వారి కటువంటి యిక్కట్లు కలగకూడదనే దృఢ నిశ్చయంతో, ఛైర్‌మన్ మావ్ హువాయ్‌నదిని పూర్తిగా అదుపులోకి తేవాలనే నినాదాన్ని చేబట్టారు. దానితో ప్రజలు, ప్రభుత్వము ఏకాగ్రతతో, దృఢసంకల్పంతో కార్యక్రమాని కుపక్రమించారు. రైతుజనం తమ తీరిక సమయాన్ని సద్వినియోగం చేయడానికి ప్రభుత్వంతో సహకరించి ఈ నదీ ప్రాజెక్టులను త్వరగా నిర్మించడానికి తోడ్పడ్డారు. ఇంజనీర్లతోపాటు కార్మికులు, వారితో పాటు కూలీలు, వారి ననుసరించుకుంటూ బియ్యం, బొగ్గు, ఉన్నిదుస్తులు, మందు మాకులు నడవడం ప్రారంభమయింది. హువాయ్‌నది తన నిరంకుశత్వానికి స్వస్తిచెప్పి, ప్రజల – ప్రభుత్వం యొక్క సహకారానికి, కార్మికుల దృఢనిశ్చయానికి, కూలీల పట్టుదలకు లొంగిపోయింది.

ఈ నదీ ప్రాజెక్టుల నిర్మాణంవల్ల వరదల నష్టాలు, బీభత్సాలు నివారింపబడడమే కాకుండా, అయిదుకోట్ల ప్రజల సుఖ జీవనానికి అవకాశంకూడా కలిగింది. ఆహారపదార్థాల కొరత

తీరింది. విద్యుచ్ఛక్తిని నిర్మాణం చేయడానికి వీలుపడింది. నౌకా ప్రయాణాలకు రహదారి ఏర్పడింది, ఎల్లోనదితో కలసి హువాయ్ నది కల్పించే బీభత్సాల ప్రమాదం తొలగింపబడింది. ఓడ ప్రయాణాల కనువుగా ఒక కొత్త కాలువను ఎల్లో సముద్రం వరకు ఏర్పరచి, రవాణాలు అభివృద్ధిచేయబడ్డాయి. ఈ గొప్ప నిర్మాణ కార్యక్రమంలో బాధ్యతవహించి, ప్రాజెక్టులను పూర్తి చేయడానికి అధికారం వహించి, బాధ్యతలను నిర్వహించడంలోను, శక్తిసామర్థ్యాలను ప్రదర్శించడంలోను, అనేకవేల జనంచేత పని పాటలు చేయించడంలోను పురుషులతోపాటు స్త్రీలుకూడ కృషి చేయగలరని నిరూపించడానికొక స్త్రీ ఇంజనీరు తన కార్యదక్షతను ప్రదర్శించే అవకాశం దొరికింది. చైనా నదుల నిర్మాణ కార్యక్రమాలలో పురుషులతోటు స్త్రీలుకూడ పాల్గొంటున్నారు.

హాంచీ నీటి పారుదల విధానం చాలా ముఖ్యమయింది. ఈ ప్రాజెక్టు 1951 లోనే పూర్తి అయింది. ఏడెనిమిది జలాశయాలను యీప్రాజెక్టు తన ఆధీనంలోకి తెచ్చుకుంది. 580 కోట్ల క్యూబిక్ మీటర్ల నీటిని యీజలాశయాలు తమలో నిలువరించు కుంటూ వున్నాయి. వీటి నుండి నీటి పారుదల అయ్యే తూముల కమర్చిన ఉక్కుదర్వాజాలన్నీ షాంగ్ హే కార్మికులు రాత్రింబవళ్ళు కష్టపడి 40 రోజులలో నిర్మించారు.

వరదనీరు గట్లపైన పొంగకుండా, ప్రక్క పొలాలకు నష్టం కలగకుండా ఉండడానికి ఎన్నో వందల మైళ్ళవరకు నదికి ఎత్తయిన కట్టలు వేయబడ్డాయి. నీరు త్వరగా ప్రవహించడానికి నదీగర్భం నుండి ఒండుమట్టి లోతు చేయబడింది. ఈ ప్రాజెక్టు నిర్మాణంలో అనేక లక్షల జనం నియోగింపబడి నిరుద్యోగంనుండి విడబడ్డారు.

హువాయ్‌నది ప్రాజెక్టులలో ఒకటయిన ఫుట్సులింగ్ జలాశయాన్నిచూచే అవకాశంకూడ మాకు కలిగింది. హువాయ్‌నది ఉపనదులలో ముఖ్యమైన బీ నది నరికట్టి ఈ జలాశయం నిర్మించారు. వరదలవల్ల ప్రజాసంక్షోభం కలిగించే ఉపనదులలో యిది పేరు

గాంచింది. తాప్‌హె పర్వతాగ్రాలు సముద్రమట్టానికి రెండువేల మీటర్ల ఎత్తున వున్నాయి. ఈ నది సుళ్ళు మలుపులు తిరుగుతూ, వక్రగమనంతో ప్రవహిస్తుంది. వర్షాలు కురిసినప్పుడంతా ఉద్ధృతం చూపుతూ, వర్షాలాగగానే యెండిపోతూ వుంటుంది. ఈ నదీ ప్రవాహాన్ని అరికట్టి, నీరు నిలపడానికి రెండు పెద్ద కొండలనడుమ ఒక అడ్డుకట్ట నిర్మింపబడింది. దీని నిర్మాణం 1952 లో ప్రారంభ మయి, 1955 ఆఖరులో పూర్తికాగలదని అంచనా వేయబడింది. జలపాతంద్వారా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి యంత్ర నిర్మాణంకూడ జరిగింది. ప్రాజెక్టు 1955 ఆఖరులో ముగియడానికి బదులు ప్రజల సహకారం, కార్మికుల దీక్ష, కూలీల పరి శ్రమ, ఇంజనీర్ల కార్యదక్షతవల్ల 1954 జూన్‌లోనే ముగియ బోతుందని మాకు తెలిసింది. అంచనావేసిన సమయంకంటె 17 నెలలు ముందుగా యీ ప్రాజెక్టు నిర్మింపబడింది. బీ నదిడాము ఇతర కట్టలవలె కాకుండా ఒక ప్రత్యేకపద్ధతిలో అనేక ఆర్చిలతో నిర్మింపబడింది. ఇది రాతితోగాని, యిటుకతోగాని గాక, రీ-ఇన్ ఫోర్సుడు కాంక్రీటుతో నిర్మాణం చేయబడింది. ఈ కట్టపొడవు 500 మీటర్లు, ఎత్తు 70 మీటర్లు. 11 తూము లేర్పరుపబడ్డాయి. ఈ తూములు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి, వ్యవ సాయానికి నీటి పారుదల కలిగించడానికి ఉపయోగిస్తాయి. దీని జలాశయంలో 50 కోట్ల క్యూబిక్ మీటర్ల నీరు నిలువచేయబడు తుంది. ఈ డాము నిర్మాణంలో 190 వేల క్యూబిక్ మీటర్ల కంకర, 50 వేల టన్నుల సిమెంటు, 3 వేల టన్నుల ఉక్కు, 7 వేల క్యూబిక్ మీటర్ల కలప వినియోగమయింది. డాము నిర్మాణంలో 1900 మంది కార్మిక నిపుణులు, 16000 మంది కూలీలు, 21000 మంది కర్షకులు నవచైనా సైన్యంలోని ఒక డిటాచ్‌మెంటు ఉన్నారు. నిర్మాణ ప్రదేశానికి, ఇతర సౌకర్యాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి విద్యుద్యంత్రశాల ఒకటి, కలపను కోసే వర్కు-షాపు ఒకటి, యింకొక కార్మిక వర్కు-షాపు నిర్మాణం చేయ

బడ్డాయి. ఈ డాము నిర్మాణానికి కావలసిన కంకర, ఇసుక అందించడానికి రెండు గొప్ప గనులుతవ్వబడ్డాయి.

ఒకప్పుడు భీకరారణ్యాలతోనిండిన పర్వత ప్రదేశమంతా యిప్పుడొక మహాపట్టణముయి వెలిగిపోతోంది. డాము నిర్మాణ ప్రదేశంలో కార్మికులు సమావేశమయి చర్చించుకోడానికొక పెద్ద హాలు, ఒక బ్యాంకు, పోస్టాఫీసు, టెలిగ్రాఫ్ ఆఫీసు, పుస్తక శాల, మార్కెట్టు, ఆసుపత్రి, సినిమాశాల యేర్పాటు చేయ బడ్డాయి. కార్మికులు తీరిక సమయంలో కులాసాగా కాలం గడుపు కోడానికి ఒక నాట్యమండలి, నృత్యబృందం వున్నాయి. అనేక ఆర్చి లతోకూడుకున్న యీ డాము నిర్మాణంలో ఎన్నో ప్రతిబంధ కాల నెదుర్కోవలసి వచ్చింది. చైనాలో ఇట్టి డామును నిర్మించ డానికిదే తొలిసారి. దీని స్వరూపభావనాపటం తయారు చేయ డానికెంతో అనుభవము, మేధాశక్తి అవసరమయింది. ఈ డామును నిర్మించిన ప్రదేశంలో తరచు భూకంపాలు వస్తూవుంటాయి. వాటివల్ల డాముకి ప్రమాదంలేకుండా వుండేటంతటి దృఢంగా దీని నిర్మాణం జరిగింది. విపరీతమైన వరదలతో పొంగే ప్రవాహాన్ని సిలువరించే బలంకూడా దీనికుండాలి. ఇవన్నీ దృష్టిపథంలో వుంచు కొని చైనా ఇంజనీర్లు దీని ప్లానుల్ని తయారుచేశారు. మహా మేధా వులు, అనుభవజ్ఞులు తమ మెదళ్ళను కరిగించి 800 ప్లానులు తయారుచేశారు.

కట్ట నిర్మాణంలో ఎన్ని ప్రతిబంధకా లేర్పడినా నిరు త్సాహం చెందకుండా, ఎంతో సాహసంతో, కార్యదక్షతతో దాన్ని పూర్తిచేయగలిగారు. కార్మికులు, కర్షకులు, సైనికులు, కూలీలు విపరీతమైన వర్షాలకు, చలికి చలించకుండా అహో రాత్రులు పనిచేసి కార్యసాధకులయ్యారు. 1953 మే దినోత్సవం నాటి నవచైనాకు తమ కానుకగా ఈపని నిర్వహించి మే ఒకటవ తేదీన రక్తపతాకం యెగురవేయాలని వారు నిశ్చయించుకున్నారు. కాని, ఏప్రిల్ 20 వ తేదీనుండి కుంభవృష్టి ప్రారంభమై, పని

కాటంకం కలిగించింది. అయినా పని ప్రారంభమయి కార్మికులు పట్టు వదలకుండా 30 వ తేదీ నాటికి కృతకృత్యులై మే దినోత్సవ సందర్భంలో సగర్వంగా ఎర్రజెండా నెత్తారు. ఇది నవచైనానిర్మాతలైన కార్మికుల, కర్షకుల దృఢనిశ్చయానికి, కార్యశూరతకు తార్కాణం.

ఒకప్పుడు సెకండుకు 3 వేల క్యూబిక్ మీటర్ల నీటిని ప్రవహింపజేసే బీనది నేడు 6 వందల మీటర్ల నీటిని ప్రవహింప జేసేటట్లు శాసించారు. బీనది ప్రాజెక్టు మూలకంగా 7 లక్షల మూవ్‌ల భూమి సాగుబడి క్రిందకే వస్తుంది. ఇదివరలో బీనది నౌకాయానాని కనువుగా వుండేదికాదు. ఇకముందు, సంవత్సరం పొడుగునా 50 టన్నుల ఓడలుకూడ ప్రయాణం చేయవచ్చు. ఇంజనీరు వుడ్‌సన్ వాంగ్ ఆధిపత్యంలో ఈ ప్రాజెక్టు నెరవేరింది.

ఈయన చైనా ఇంజనీర్లలో పేరుపొందిన వారిలో ఒకడు. ఈయన నమ్రత, నిరాడంబరత చూస్తే ఇంత గొప్ప ఇంజనీరని యెవరూ తలవరు. ఈయన కార్మికులతోను, కూలీలతోను కలసి పనిచేస్తూ వుంటే ఒక ఓవర్‌సీయరో, లేక సూపర్‌వైజరో అయి వుంటాడనుకున్నాను. ఈయన కార్మికవర్గంలో కలసిపోయి వారిలో ఒకడయిపోవడం, ఎటువంటి అతిశయము, అధికార గర్వము లేకుండా వ్యవహరించడము, వాళ్ళమాదిరి దుస్తులే ధరించడము, వాళ్ళతోపాటు కొండలమధ్య చలి, వాన, ఎండలకోర్చి నిలవడము, వారి మాదిరిగా పూరి గుడిసెలలో తానూ నివాసం చేయడము—యివన్నీ చూస్తే చాలా ఆశ్చర్యం కలిగింది. నాలుగైదేండ్లలో పూర్తి కావలసిన ప్రాజెక్టు రెండు సంవత్సరాలలో ఏ విధంగా పూర్తిచేయ కలిగారా అనే సందేహం నాకు కలిగింది. అధికారులు, కూలీలు అనే భేదభావం లేకుండా అంతా అన్నదమ్ములవలె వర్తిస్తూ పరస్పర విశ్వాసంతోను, ప్రేమతోను వర్తించడమే దీనికి కారణమని నేనూహించాను.

నవచైనాలో యిటువంటి ఎన్నో ప్రజోపయోగమైన నిర్మాణ కార్యకలాపాలు జయప్రదంగా, సునాయాసంగా నెరవేర డానికి కార్మికులలోవుండే శ్రద్ధ, అధికారులలోవుండే అభిమానము, వీరందరి ఏకైకలక్ష్యము, దేశాభిమానము కారణమౌతున్నాయి. ఎటువంటి అనామకుడయిన కార్మికుడయినా అభివృద్ధిని సూచించే సలహా ఈయవచ్చు. వాటినినిరాకరించకుండా, నిరాదరణదృష్టితో త్రోసివేయకుండా ఎంతపెద్ద అధికారులయినా, ఎంత అనుభవ శాలురైనా వెంటనే ఉపయోగం చేసుకొని అతడినెంతో గౌర వించి తక్కిన కార్మికులందరికీ అతడు మార్గదర్శకుడుగా వుండేటట్లు పైకి తెస్తారు.

ఫుట్సులింగ్‌లో వున్నప్పుడు హువాయ్‌నదిని గురించిన ఒక సినిమా చూచాము. దానివల్ల వుడ్‌సన్‌వాంగ్ ఎంతప్రముఖుడో విదితమయింది. నిర్మాణంలో నిమగ్నులైన కార్మికులలో కలసి వాళ్ళతో పరిచయాచకంగా మాటలాడడము, వారి నిత్యజీవితాలను గురించి విచారించడము, వారి ఆచార వ్యవహారాలను గురించి తెలుసుకోడానికి యత్నించడము, వాళ్ల మనస్తత్వాన్ని గుర్తించ డానికి ప్రయత్నం చేయడమూ, రాజకీయంగా వాళ్ల అభిప్రా యాలు ఎంతవరకు అభివృద్ధి చెందాయో తెలుసుకోడానికి ప్రశ్నిం చడము- ఇవన్నీ నా చైనా స్నేహితులు కనిపెడుతూవున్నారు.

ఫుట్సులింగ్ కార్మికులకు ఏదయినా బ్రాడ్‌కాస్టింగ్ ఉప న్యాసం ఈయమని నన్ను కోరారు. నిరాకరించడం కష్టమయింది. నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నులయిన కార్మికుల నుద్దేశించి వారిలోవుండే ఉత్సాహము, కార్యదక్షత, శక్తిసామర్థ్యము అభి నందిస్తూ, నవచైనా యొక్క మహోజ్వల భవిష్యత్తుకు వారెంత ప్రాముఖ్యత వహిస్తున్నారో తెలియపరుస్తూ, ప్రజాసౌఖ్యానికి, సంపదకు వారుచేసే కృషిని కొనియాడుతూ నాలుగైదు నిమిషాలు మాటలాడాను. వారి నిర్మాణశక్తిని కళ్ళారాచూడకపోతే చైనాలో

యింతటి గొప్పమార్పులు సంభవించాయని విశ్వసించడానికి అనుకూలమైన వాడినని కూడా తెలిపాను.

మేము ఫుట్సులింగ్‌కి వచ్చినప్పుడూ, అక్కడినుంచి తిరిగి వచ్చేటప్పుడూ కార్మికుల నాట్యబృందం మేళతాళాలతో, నృత్య గానంతో మాకు స్వాగతం, వీడ్కోలు నిచ్చిన దృశ్యం యింకా కళ్లకు కట్టినట్లే తోస్తుంది. చైనా ప్రజల ప్రేమ, అభిమానం అపారమయి వాళ్ళతో ఒకసారి కలిసినవాళ్ళు జన్మాంతము వాళ్ళను మరవలేని సుహృద్భావాన్ని కలిగిస్తారు.

ఇక్కడనుండి మేమంతా ఒకనాడు చాంగ్ కై షేక్ కు రాజధానీ నగరమయిన నాంకింగ్‌కు ప్రయాణమయ్యాము.

ఫుట్సులింగ్ డ్యాము నిర్మాణం యెటువంటి యంత్ర సహాయమూ లేకుండా కేవలం మానవశక్తితోనే పరిసమాప్తి చేయబడింది. సిమెంటు, కంకర, కలప చిన్న మిషనులు మాత్రమే ఇక్కడ వాడబడ్డాయి.

# 7

# స్వాతంత్ర్య వీరుల సమాధులు

మే 18 వ తేదీ ఉదయం నాంకింగ్ పట్టణం చేరాము. రైల్వేస్టేషనులో వందలకొద్ది కార్మికులు, స్త్రీ పురుషులు, బాల బాలికలు పూలగుత్తులతో "ప్రపంచ శాంతి చిరస్థాయి అగుగాక, ప్రపంచ కార్మికుల మైత్రి వర్ధిల్లాలి" అనే నినాదాలతో మాకు స్వాగతమిచ్చారు. పదిగంటలకు మేమున్న హోటలు హాలులో అంతర్జాతీయ కార్మిక ప్రతినిధుల సమావేశం జరిగింది. అందులో మా కార్యక్రమం గురించి చర్చలు జరిగాయి.

మధ్యాహ్నం భోజనానంతరం సన్‌యట్‌సేన్ స్మారక భవనానికి వెళ్ళాలని తీర్మానం చేయబడింది. అంతర్జాతీయ కార్మిక ప్రతినిధులందరిపక్షాన ఒక పెద్ద పుష్పవలయం సన్‌యట్‌సేన్ సమాధిముందు అర్పించాలని నిర్దేశించబడింది. ఈ పుష్పవలయం అందరి తరఫున సోవియటు కార్మిక ప్రతినిధివర్గ నాయకుడు అర్పించాలని బర్మాప్రతినిధి ప్రతిపాదించాడు. తక్కిన ప్రతినిధులంతా దీనికి సమ్మతించారు. కాని భారత ప్రతినిధుల కీ విధానం నచ్చలేదు.

చైనాకు వచ్చిన ఆరుగురు ప్రతినిధులలో శ్రీ శిశిర్‌రాయి జబ్బుపడి పెకింగ్ ఆసుపత్రిలో వుండిపోయాడు. శ్రీ శిబ్బన్‌లాల్ సక్సేనా శాంతి సమావేశంలో పాల్గొనడానికి బెర్లిన్ వెళ్ళిపోయాడు. మేము నలుగురమే మిగిలిపోయాం.

సన్‌యట్‌సేన్ చైనా విప్లవాలలో ప్రముఖపాత్ర వహించిన మహావీరుడు. చైనా ప్రథమ ప్రజాస్వామ్యాని కీయన జనకుడు. చక్రవర్తుల నిరంకుశపాలనను, విదేశ సామ్రాజ్యవాదుల దోపిడీని ఎదిరించి చైనా ప్రజలలో స్వతంత్రభావాలనూ, ఆత్మగౌరవాన్ని రేకెత్తించిన ప్రజ్ఞానిధి. ఈ రాజకీయ దురంధరుడి గొప్పతనాన్ని ప్రపంచమంతా గుర్తించి జోహారు లర్పించింది. అనేక శతాబ్దాలు తమ ఆర్థిక, రాజకీయ, విజ్ఞాన స్వాతంత్ర్యాలను కోలుపోయి పశువులకంటె హీనంగా చూడబడుతూవుండిన చైనా ప్రజలలో ఆత్మాభిమానం, గౌరవం రేకెత్తించిన మహోజ్వల వ్యక్తి.

ఈయన జీవిత చరిత్రను కొంచెం విపులంగా తెలుసుకున్న భారత ప్రతినిధు లీయనకు గౌరవపూర్వకంగా జోహారు లర్పించి పుష్పవలయాన్ని అర్పించే హక్కు ఏ ఒక్క ప్రతినిధికీ చెందకూడదనీ, అందరికీ అవకాశం వుండాలనీ వాదించారు. ఈ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా వెల్లడించడంలో శ్రీ బినయరాయ్ ముందు కొచ్చాడు. మే మతని వాదనను బలపరచాము. మా అభిప్రాయాన్ని చైనాసోదరులుకూడ అంగీకరించారు. కాని దాన్ని ఆచరణలో పెట్టడానికి తగిన అవకాశం లేకపోయింది. వ్యవధి చాలా తక్కువఅవడంచేత, అంతతక్కువసమయంలో 500మంది ప్రతినిధులకు తలాఒక వలయం తయారు చేయాలంటే సాధ్యంకాని పని. ప్రతినిధులందరికీ అంగీకారయోగ్యమైన ఒక విధానాన్ని మే మెవ్వరం సూచింపలేకపోయాము. చైనా సోదరులు మేమంతా యేమి నిశ్చయంచేస్తే తాము ఆ యేర్పాటు చేస్తామన్నారు. ఎంతసేపటికీ ఒక విధానం తట్టలేదు. ఆఖరికి చైనా సోదరులే మా అందరికీ అంగీకారమైన ఒక విధానం సూచించారు.

ఒకగొప్ప పుష్పవలయం నిర్మించి, దాన్ని అయిదు సిల్కు రిబ్బన్లతో బంధించాలనీ, వాటిని ఆసియాఖండం తరఫున యిద్దరు, యూరప్‌తరఫున ఒకరు, సోవియట్ ప్రతినిధి ఒకరు కలసి తీసుకొని వెళ్లాలనీ, దాన్ని అందరు కలసి అర్పించాలని అన్నారు. ఆసియా

ప్రతినిధులలో ఒక భారతప్రతినిధి తప్పకుండా వుండాలని కూడ సూచించారు. అంతేకాకుండా అంతర్జాతీయ ప్రతినిధులందరూ తలా ఒక పుష్పగుచ్ఛాన్ని అర్పించేందుకు యేర్పాటులుకూడ చేయబడు తాయని చెప్పారు. ఈవిధాన మాకూ యితరులకూ కూడ అంగీకార మయింది. భారతదేశ ప్రతినిధులపక్షాన శ్రీ సియాబిహారీ శరణ్ పుష్పవలయాన్ని అర్పించే అయిదుగురిలో ఒకనిగా మేము ప్రతిపాదించాము. దీనితో ఆ చిక్కు విడిపోయింది.

సన్‌యట్‌సేన్ 1867 నవంబరు 12 వ తేదీన జన్మించాడు. 1911 సంవత్సరపు చైనా స్వతంత్ర విప్లవాని కీయన నాయకత్వం వహించాడు. మంచూ చక్రవర్తులను పదభ్రష్టులనుచేసి, వారి నిరంకుశ పరిపాలన నంతమొందించి, ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడాని కీయన పోరాటం సాగించాడు. ఈ విప్లవంలో మంచూ చక్రవర్తుల ప్రభుత్వం పడిపోయినా, అధికారం ప్రజాయత్తం కాలేదు. రష్యాలో విప్లవం జయప్రదమయి అక్కడి ప్రభుత్వాధిపత్యం కార్మికులకు, ప్రజలకు వశమయిన తరువాత, ఆ విప్లవ విజయంవల్ల నూతనోత్సాహం పొంది, 1924 వ సంవత్సరంలో కొమింటాంగ్ పార్టీలోని లోపాలను సరిదిద్ది సన్‌యట్‌సేన్ దానికి నూతన జీవితం కలిగించాడు. ప్రజాసముదాయంలో మళ్ళీ విప్లవజ్వాలలను రగుల్గొలిపాడు.

ఈ విప్లవం మూడు సూత్రాలపై ఆధారపడింది. ఒకటి: రష్యాతో దృఢస్నేహం అలవరచుకోడం; రెండు: చైనా కమ్యూనిస్టు పార్టీతో చేతులు కలిపి విప్లవాన్ని జయప్రదం చేయడం; మూడు: కార్మికులను, ప్రజలను చైతన్యంపొందించి వారి హక్కులను కాపాడడం, తద్వారా ప్రజావిప్లవానికి వారి పూర్తి సహకారం పొందడం. ఈ మూడు నియమాలను ఆచరణలోపెట్టి ఆయన 1924 నుంచి 1927 వరకు విప్లవాన్ని లేవదీసి నాయకత్వం వహించాడు. చాంగ్ కై షేక్ కృతఘ్నతవల్ల, ద్రోహంవల్ల ఈ విప్లవం అసం

పూర్తిగా నిలచిపోయింది. ప్రభుత్వాధిపత్యం ప్రజలకుకాకుండా యుద్ధోన్మాదులైన నిరంకుశ సైనికనాయకుల హస్తగతమైంది. దీని వల్ల సన్ యట్ సేన్ యొక్క గొప్ప ఆశయాలన్నీ కలలై పోయాయి. చరిత్రలో మాత్రం ఆయన మహా విప్లవనాయకుడు. చైనాలో ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు జనకుడు.

సన్ యట్ సేన్ స్మారక భవనం, దాని ఉద్యానవనం 55 ఎకరాల ప్రదేశాన్ని ఆక్రమిస్తున్నాయి. ఆయన సమాధి 180 మీటర్ల ఎత్తైన (1 మీటరు=1 గజం, 3¾ అంగుళాలు) ఒకచిన్న పర్వతంపై నిర్మింపబడ్డ ఒక శిల్పకళాఖండం. దానికి వెనుక అర్ధ వలయాకారంలో చుట్టూ ఎత్తయిన పర్వతపంక్తులు మహా వృక్షాలతో ఆవరించి వున్నాయి. ఈ ప్రదేశం చాల సుందరం గాను, ఉన్నతభావాలను పురికొల్పేటట్లు వుంటుంది. ఈ సమాధి భవనానికి 393 సోపానాలున్నాయి. దీన్ని లూయెన్‌చీ అనే ప్రసిద్ధ శిల్ప శాస్త్రజ్ఞుడు నిర్మించాడు. కాంటన్ పట్టణం జపాన్ పరిపాల నకు తలయొగ్గిన రోజులలో ఈ కళాభవనాన్ని వాళ్ళు కొంతవరకు నాశనం చేశారు. కొమింటాంగ్ పరిపాలకులు దీన్ని పునర్నిర్మాణం చేయడానికైనా తలపెట్టలేదు.

సన్ యట్ సేన్ 1929 వ సంవత్సరంలో పెకింగ్‌లో కీర్తిశేషు డయ్యాడు. ఆయన భౌతికశరీరం 1-6-1929 తేదీని కాంటన్‌లోని యీ స్మారకభవనంలో భూస్థాపితం చేయబడింది. ఈ ప్రదేశంలో ఒక పెద్ద స్ఫటికశిలావిగ్రహం కూడ నిర్మింపబడింది. ఈ స్మారక భవనం లోపలిభాగమంతా వివిధరంగుల చంద్రకాంత శిలాఫల కాలతో నిర్మింపబడి, కడుసొంపుగా వుంది. సన్ యట్ సేన్ శిలా విగ్రహందగ్గర మేమంతా పూలగుత్తుల నర్పించి, గౌరవపూర్వ కంగా వందనాలర్పించాము.

ఇక్కడనుంచి ఒక మంచూ చక్రవర్తి సమాధి మందిరం చూచాము. ఇది పాతకాలపు చైనా శిల్పసంపదకు కోశం. ఈ

సమాధి మందిరాని కావల చక్రవర్తుల, సేనాధిపతుల శిలా విగ్ర హాలు, గొప్ప గొప్ప రాతి యేనుగులు, సింహాలు, ఒంటెలు, ఎద్దులు స్థాపింపబడి వున్నాయి. ఇవన్నీ చెక్కు చెదరకుండా నిన్ననో నేడో నిర్మింపబడినట్లు అగపడుతూ వుంటాయి. ఈ మంచూచక్రవర్తి తన పరిపాలనలో అనేకమంది సామంత ప్రభువుల తోను, సర్దారులతోను పరివేష్టింపబడి వుండేవాడు. తన జీవితానంతరం భూస్థాపితమై, యీ జంతు సంతానంతో కాపలా కాయబడుతున్నాడు. ఈ చక్రవర్తి మహాప్రజాపీడకుడు. ప్రజ లందరూ ఇతని నిరంకుశత్వాన్ని తెగనాడేవాళ్లు. తన మరణా నంతరం, తన భౌతికశరీరాన్ని సమాధినుంచి యీడ్చి ప్రజలు అవమానం చేస్తారని ఇతని భయం. ఈ అవమానంనుంచి తప్పుకో డానికి తన శవం యే సమాధిలో స్థాపితం చేయబడిందో ప్రజలకు తెలియకుండా వుండాలని ఈతడు తన జీవితంలోనే అనేక సమాధు లను నిర్మించుకున్నాడు. ఇందులో దేనిలోనో ఒకదానిలో తన్ను రహస్యంగా భూస్థాపితం చేయాలని ఆదేశించాడు. ఈయనకు సమ కాలికుడైన ఒక చైనాకవి ప్రజలపక్షంపూని ఇతనికి హితోపదేశం చేస్తూ పద్యాలు వ్రాసేవాడు. చక్రవర్తి కోపాగ్ని యితణ్ణికూడ చుట్టుకుంది. అయినా యితడు చలించకుండా "నీ వెన్ని సమాధులు నిర్మించుకున్నా, దేనిలోనో ఒకదాంట్లో నైదీవి గాకపోవనీ, ప్రజల కోపంనుంచి తప్పించుకునే యత్నంలో సమాధిరాళ్ళ కాహుతై పోతున్నా"వనీ హెచ్చరించాడు. అప్పటినుంచి "చక్రవర్తి ప్రజల నుంచి తప్పుకున్నా తాను నిర్మించుకున్న సమాధినుంచి తప్పుకో లేడ"నే సామెత వచ్చింది.

రెండో రోజు నాంకింగ్‌లోని కార్మికుల విజ్ఞానమందిరాన్ని దర్శించాము. ఈ భవనం చాంగ్‌కై షేకు షష్ఠిపూర్తికి కానుకగా కొమింటాంగ్ అధికారులు నిర్మించారు. ఇది కొమింటాంగ్ పార్టీ పెత్తందారులకు విలాసమందిరంగా వుండేది. నాంకింగ్ విముక్తి పొందిన తరువాత ప్రజాప్రభుత్వం దీన్ని కార్మికసంస్థల వశం

చేసింది. అప్పటినుంచి యిది వాళ్ళ విజ్ఞానాభివృద్ధికి వినియోగ పడు తూంది. ప్రస్తుత ప్రభుత్వం రెండువందల కోట్ల ఎన్నులు (నాలుగు లక్షల రూపాయలు) వెచ్చించి యీ భవనానికి మెరుగులు దిద్దింది. 1951 జూన్ 26 వ తేదీన యీ భవనంకార్మికుల క్రీడా క్షేత్రంగా ప్రకటింపబడింది. ఇందులో కార్మికుల విజ్ఞాన, వృత్తి, విద్యాభివృద్ధులకు అవకాశాలు కల్పించబడ్డాయి. సెలవు దినాలలో, విరామదినాలలో అనేక వేలమంది కార్మికులు, వారికుటుంబాలతో యిక్కడచేరి వేడుకగా కాలంగడుపుతూ వుంటారు. కార్మికుల అభివృద్ధికోసరం ఇక్కడ ఉపన్యాసాలు జరుగుతూ ఉంటాయి. ప్రతి దినం రెండువేలమంది యీ ప్రదేశం వస్తూ పోతూ వుంటారు. కార్మికు లీభవనానికి "సౌఖ్యమందిరం" అని నామకరణం చేశారు.

నాంకింగ్ పట్టణం అంతా ఒకసారి చుట్టివచ్చాం. చైనా దేశమంతటికీ విస్తీర్ణంలో యిదే పెద్ద పట్టణం. దీని చుట్టుకొలత 60 మైళ్ళు. అయినా దీనిజనాభా పదిలక్షల ఇరవై వేలు మాత్రమే. ఈ పట్టణంలోని భవనాలు కలకత్తాలో వున్నట్లుంటాయి. రోడ్లు విశాలంగాను, పరిశుభ్రంగాను వున్నాయి. స్త్రీ పురుషులు, బాల బాలికలు జట్లు జట్లుగా పోతూవుంటారు. వీళ్ళందరూ ఒకే మాదిరి దుస్తులు ధరించి, చూడ ముచ్చటగా వుంటారు. చైనా పట్టణాలలో మన దేశంలోవలె గుఱ్ఱపు బండ్లు, టాంగాలు లేవు. మోటార్లుకూడ తక్కువగా అగుపిస్తాయి. రిక్షాలే ఎక్కువగా తిరుగుతుంటాయి (ఇవి మోటారు రిక్షాలుకావు; సైకిలురిక్షాలు). పట్టణంచుట్టూ గొప్ప రాతిగోడ వుంది. చాంగ్‌కై షేక్ రాజ కీయ కారణంగా తన ప్రభుత్వపు రాజధానిని పెకింగ్‌నుంచి నాంకింగ్‌కు 1927 సంవత్సరంలో మార్చుకున్నాడు. 1949 వ సంవత్సరంలో కొమింటాంగ్ సైన్యాలను ఓడించి ప్రజాసైన్యాలు యీ పట్టణానికి విముక్తి కలిగించాయి.

తరువాత నాంకింగ్‌లోని చారిత్రక వస్తు ప్రదర్శన మంది రానికి వెళ్లాము. ఇది ప్రభుత్వ చారిత్రక పరిశోధన శాఖవారిచేత

నిర్మింపబడ్డది. క్రీస్తుకు 5 వేల సంవత్సరాలకు పూర్వంనుంచి ప్రస్తుతకాలంవరకు క్రమేణా అభివృద్ధిపొంది అనేకమార్పులు చెందిన కళాఖండా లిక్కడ ప్రదర్శింపబడి వున్నాయి. లలితకళలు, చిత్రలేఖనము, కుటీర పరిశ్రమలు, వివిధ కాలాలలోని మృణ్మయ భాండాలు వున్నాయి. వీటినుంచి గత యేడు వేల సంవత్సరాలలో చైనా నాగరికత యేవిధంగా అభివృద్ధి చెందినదీ గోచరిస్తుంది. డార్విన్ సిద్ధాంతాన్ని బలపరుస్తూ మర్కటంనుంచి మానవుడు యేవిధంగా అభివృద్ధిచెంది పరిణామం పొందాడో సూచించే అస్తి పంజరా లనేకం వున్నాయి.

ఇంకోభాగంలో 1911 వ సంవత్సరపు విప్లవంనుంచి నేటి వరకు చైనాలో జరిగిన మార్పులను వ్యక్తపరచే వివిధ పటా లున్నాయి.

ఈ మ్యూజియంలో భారతదేశానికీ, చైనాకీ అనేక వందల సంవత్సరాలకు పూర్వం సన్నిహిత సంబంధం కల్పించి ఈ రెండు దేశాలు విజ్ఞానంలోను, సంస్కృతిలోను, నాగరికతలోను, శిల్పం లలితకళలోను పరస్పర సహాయంపొంది వాటి ఉన్నతికి అవకాశం కలిగించడానికి దారిచూపిన బౌద్ధయాత్రికుడు హుయెన్ త్సాంగ్ అస్తికలూక మరకత పేటికలో ప్రదర్శింపబడి వున్నాయి. హుయెన్ త్సాంగ్ భారతదేశయాత్ర, శ్రీహర్ష చక్రవర్తి ఆతిథ్యము, బౌద్ధమతాన్ని గురించి ఆయన సర్వమతసమావేశంలో యిచ్చిన ఉపన్యాసాలు, హ్యుయెన్ త్సాంగ్ ఓఢ్రదేశపు పరిపాలకునికి అతిథిగా వున్నప్పుడు శ్రీహర్షుని ఆహ్వానము, ఓఢ్రరాజు అలసత, శ్రీ హర్షుడు యుద్ధం ప్రకటించగా హుయెన్ త్సాంగ్‌ని పాటలీపుత్రానికి పంపడము మొదలైన విషయాలన్నీ స్మృతిపథంలో తాండవించాయి.

ఈ మ్యూజియంలో ఆరోశతాబ్దము, అయిదోశతాబ్దము లోని మానవసమాధులనుండి పరిశోధన జరిపి సేకరించిన వస్తు సముదాయం ప్రదర్శింపబడివుంది. ఈ మ్యూజియం కేవలం చైనా

దేశందే. కాకుండా, ప్రపంచ మానవ పరిణామాలను సూచించే అమూల్య వస్తుసంపదకు మహాకోశంగా వుంది. ఇక్కడి అధికారులు మా అందరినీ తేనీటితోను, ఫలహారాలతోను ఆదరించారు.

నాంకింగ్‌లో యివేగాక యింకా యెన్నో చారిత్రక వస్తు సంపద లున్నాయి. పాతచక్రవర్తుల భవనాలు, చాంగ్ కై షేకు నివాసమందిరాలు మొదలైనవి ఉన్నాయి. భారతదేశంలాగే చైనా కూడా పెక్కుచారిత్రక పట్టణాలను కలిగివుంది.

కొన్ని వందల సంవత్సరాల క్రితం ఒక బౌద్ధసన్యాసి బుద్ధుని గురించి ఉపన్యాసం కావించినతావు ఒకటుంది. ఆయన బోధకి స్వర్గంకూడ ఆనందాతిరేకంతో తన్మయమయి పోయిందట. దేవతలా ప్రదేశంపైన పూలవర్షం కురిపించారట. అందువల్ల దానికి "యూహా-తాయ్" (అనగా పుష్పవర్ష వేదిక) అనే పేరు వచ్చింది. అనేక తరాలనుంచి యిది చాల పవిత్రస్థలంగా గౌరవింపబడుతూ వచ్చింది. ఇది ఒక చిన్న పర్వతం. దీనిచుట్టూ అనేక పర్వతాలు, గొప్పగొప్ప వృక్షాలతో ఒక అరణ్యంలా గోచరిస్తూ యెంతో రామణీయకంగా వుంటుంది. మేఘాలు యీ పర్వతాలను కప్పుతూ వుంటాయి. తరచు చినుకులు పడుతూ యెంతో హాయిగాలుపుతూ వుంటుంది. ఈ పవిత్ర ప్రదేశాన్ని చాంగ్ కై షేక్, అతని అనుచరవర్గం, తమ రాక్షస పరిపాలనను కూలద్రోసి ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పడానికి యత్నించేసిన దేశభక్తులను ఉరితీయడానికి, నిలువబెట్టి తుపాకులతో కాల్చిచంపడానికి వినియోగం చేశారు. అర్ధరాత్రి దేశభక్తులయిన విప్లవవాదుల నీ ప్రదేశంలోకి తెచ్చి ఉషఃకాలంలో వాళ్ళ నురితీసేవారు. ఒకప్పుడు శాంతిపాఠాల తన్మయత్వంలో పూలు వర్షించిన యీ ప్రదేశంలో చాంగ్ పరిపాలనలో ప్రతి అంగుళము నేల, స్త్రీ పురుషుల వేడినెత్తురుతో తడిసి పోయింది. ఈ ప్రదేశంలో వందలకొలది సంవత్సరాలక్రితం అజ్ఞానం నుంచి విముక్తి పొందడానికి బుద్ధభగవానుని శిష్యులు త్రిపిటకాలను

ఘోషించి, 'బుద్ధంశరణం గచ్ఛామి' 'ధర్మం శరణం గచ్ఛామి' 'సంఘం శరణం గచ్ఛామి' అని ముక్తకంఠంతో మోకరించి ఉచ్ఛరించారు. "అసతో మా సద్గమయ, తమసోమాజ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతంగమయ" అని విశ్వశాంతికి ప్రార్థన లర్పించారు. ఆ ప్రదేశంలో దేశంయొక్క అజ్ఞాన విముక్తికి, పురోభివృద్ధికి యెందరో దేశభక్తులు భవిష్యత్తుపై అచంచలమైన విశ్వాసంతో తమ ఆత్మశక్తిని ప్రకటిస్తూ, నవ్వు మొగాలతో ఉరికంబా లెక్కి ఆత్మార్పణం చేశారు. ప్రాణా లెగిసేటప్పుడు "విప్లవం వర్ధిల్లాలి! ప్రపంచశాంతి చిరస్థాయి కావాలి" అనే నినాదాలు మారు మ్రోగించారు. ఈ ప్రదేశం భారతదేశంలో జలియన్‌వాలా బాగెంత పవిత్రమయిందో చైనాలో అంతపవిత్ర మయింది. ఈ త్యాగధనులైన వీరులబలిదానంలో చైనా నవ్యజీవనం పొందింది. దాని మహోజ్వల భవిష్యత్తుకు వీరు తమ రక్తంతో యీ ప్రదేశంలో పునాదులు వేశారు. ఈ పవిత్రస్థలంలో ఈ త్యాగమూర్తులైన దేశభక్తుల గౌరవార్థం గొప్ప సుందరవనం పెంచబడింది.

వేదికపై నిరాడంబరమైన ఒక స్మృతిచిహ్నంగా సిమెంటు స్తంభం ఒకటి నిర్మాణం చేయబడింది. ఈ పవిత్ర ప్రదేశంలో మరొక ఆధిక్యత ఉంది. ఛైర్‌మన్ మావ్ తన స్వహస్తంతో వ్రాసిన అక్షరా లీ స్తంభంపైన రక్తవర్ణంలో చెక్కబడ్డాయి.

మేమీ ప్రదేశంలోని వేదికదగ్గర పూలగుచ్ఛాలుంచి, కొంత సేపు అవనత శిరస్కులమై జోహారు లర్పించాము. జ్ఞాపకార్థం ఇక్కడనుంచి ఒకటి రెండు గులకరాళ్ళేసుకపోతూంటే, తామే అవి మాకిస్తామని చైనాసోదరు లన్నారు. ఈ ప్రదేశంలో నేనూ ఒకటి రెండు బాష్పబిందువులను మహావీరులకు కానుకగా అర్పించాను. వారికంతకంటె నేను అర్పించగలదేముంది?

నాటిరాత్రి కాంటన్ ట్రేడ్‌యూనియన్ కౌన్సిలులోని చైనా సోదరులు మాకు "యూహా-తాయ్" నుంచి త్రవ్వి ఒక

ప్పుడు మహావీరుల రక్తంతో అభిషేకం చేయబడిన పవిత్రమైన కొన్ని గులకరాళ్ళను వివిధ రంగులుగల వానినొక సుందరమైన గాజుకుప్పెలోవుంచి యిచ్చారు.

విషాద విస్మయగాథలకు తావయిన యీ మహాపట్టణం నుంచి మేము 19 వ తేదీ రాత్రి బయలుదేరి షాంగ్‌హై పట్టణానికి ప్రయాణమయ్యాం.

# 8

# షాంగ్‌హైలో నూతన జీవితశోభ

మే 20 వ తేదీ ఉదయం అంతర్జాతీయ కార్మిక ప్రతినిధుల ప్రత్యేక రైలు షాంగ్‌హై పట్టణం చేరింది. ప్లాటుఫారం మీద అనేక వందలమంది కార్మికనాయకులు, కార్మికులు, స్త్రీలు, పురుషులు, బాలబాలికలు పూలగుత్తులతో, హర్ష నినాదాలతో మమ్మాహ్వానించారు. మేము రైలు దిగుతూండగా అనేకమంది చుట్టుముట్టి కరస్పర్శ చేశారు. కార్మికుల కరతాళధ్వనులు, హర్ష నినాదాలు దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. మేము వెళ్ళిన దారి పొడుగునా అనేకవేలమంది జనం బాట కిరుప్రక్కలా నిలచి, చేతు లూపుతూ మాకు స్వాగత మిచ్చారు.

చైనా దేశానికంతటికీ జనాభాలో షాంగ్‌హైపట్టణంపెద్దది. దీని జనాభా 60 లక్షలు. ఈ పట్టణంలోని పరిశ్రమలలో 14 లక్షల 30 వేలమంది కార్మికులు పనిచేస్తున్నారు. కార్మిక సంస్థలలో సభ్యులసంఖ్య 13 లక్షలు. నాలుగో శతాబ్దంలో యీ పట్టణం ఒక చిన్న బెస్తపల్లెగా వుండేది. 11 వ శతాబ్దంలో విదేశనౌకల ఆశ్రయంగా వృద్ధిచెంది, ఒక పట్టణంగా రూపుచెందింది. 13 వ శతాబ్దంలో వాణిజ్యాభివృద్ధి వల్ల పెద్ద వ్యాపారపట్టణ మయింది. 19 వ శతాబ్దంనుంచి అంతర్జాతీయ సామ్రాజ్యవాదుల దోపిడీ ముఠాలకు స్థావరమై చైనాప్రజల ఆర్థిక, రాజకీయ బహిరంగ లూటీలకు కేంద్రమయింది.

ఇక్కడి అంతర్జాతీయ శ్వేతజాతుల నివాస ప్రదేశాల పార్కులలోకి చైనా ప్రజలు ప్రవేశించే అర్హత లేకపోయింది. ఈ అవమానానికితోడు "చైనా ప్రజలకు, కుక్కలకు ప్రవేశం లేదని" వ్రాసిన బల్లలు బహిరంగంగా ప్రదర్శింపబడేవి. షాంగ్‌హై గుర్రపు పందెముల మైదానంలో చైనీయు లడుగుపెట్టడం నిషిద్ధం.

పరిశ్రమలలో శ్వేతముఖులయిన యజమానులు, వారి ఆట బొమ్మలయిన కొమింటాంగ్ అధికారులు చైనా కార్మికులను పశువులకంటె హీనంగా చూసేవాళ్ళు. చైనాప్రజల్ని, కార్మిక వర్గాన్ని వీళ్లుపెట్టిన పాట్లు, జరిపిన అత్యాచారాలు వ్రాయదలచుకుంటే ఒక పెద్ద గ్రంథం అవుతుంది. ఈ బందిపోటు దొంగల గుంపులకు ఫాదిరీలు తోడుదొంగలై నానాబీభత్సాలు, కుట్రలు జరిపి, దైవాన్ని, సత్యాన్ని, మతాన్ని, విజ్ఞానాన్ని చిత్రవధచేసి, పవిత్రమైన ఆశయాలను అపవిత్రపరచి, మతమనే మాటకే తలవొంపులు తెచ్చారు. మానవచరిత్రలో సామ్రాజ్యతత్వం యింత విచ్చలవిడిగా, యింత నగ్నస్వరూపంతో, యింత అమానుషంగా ప్రవర్తించిన ఉదాహరణ యింకెక్కడా దొరకదనుకుంటా. భారత దేశాన్ని ఒక్క బ్రిటిషు సామ్రాజ్యవాదమే తగనిపాట్లు పెట్టింది. కాని చైనాలో ప్రపంచ సామ్రాజ్యవాదులంతా ఏకమయి ఎంతో హంగామా చేశారు. చైనాప్రజల ఐశ్వర్యాన్ని కొల్లగొట్టి తరలించుకొని పోవడానికి షాంగ్‌హై కేంద్రమయింది. పరిశ్రమలలో తమ లాభాలకోసరం కార్మికుల నెంతో చౌకగాకొని వినియోగించుకునేవాళ్లు. తమ భోగలాలసత కోసరం చైనాస్త్రీలను నిర్బంధించి వాళ్ల గౌరవాన్ని, మానాన్ని కొల్లగొట్టిన నిదర్శనా లెన్నో ఉన్నాయి.

ఇక్కడి అంతర్జాతీయ సామ్రాజ్య ప్రభుత్వాల గూఢ చారులు, పోలీసుదళాలు, సైనికబృందాలు ప్రపంచంలో యెన్ని ఘోరా లున్నాయో అవన్నీ సిగ్గువిడియంలేకుండా జరిపారు. ఈ

ఘోర దురంతాల్ని యెదిరించి, ఆత్మగౌరవంకోసరం పోరాడిన దేశభక్తుల నెందరినో బహిరంగంగా కాల్చిచంపి, రహస్యంగా హత్యచేసి, విరివిగా హింసాకాండసాగించి, ప్రజల్ని భయభ్రాంతుల్ని చేయడానికి యత్నించారు. ఇక్కడ ప్రతి బ్రిటిషు సిపాయి ఒక డయ్యర్‌గా, ప్రతి అమెరికన్ సైనికుడు ఒక మెకార్థర్‌గా, ప్రతి జపాన్ సిపాయి ఒక టోజోగా ప్రవర్తించాడనడం అతిశయోక్తి కాదు. 1857 సంవత్సరపు విప్లవంలో భారత స్వాతంత్ర్య పోరాటంలోని వీరుల్ని బ్రిటిషు ప్రభుత్వం పెట్టిన బాధలన్నిటినీ చైనా ప్రజలనుభవించారు.

ఇక్కడి సామ్రాజ్యవాదుల చరిత్ర యెంత చీకటి నలుపో, దాన్ని రూపుమాపడానికి పాటుబడ్డ దేశభక్తుల చరిత్ర అంత కాంతివంతంగా వెలుగుతోంది. షాంగ్‌హై పట్టణం విప్లవానికి, చైనా కమ్యూనిస్టు పార్టీకి జన్మస్థలం. 1921 వ సంవత్సరం జూలై 1 వ తేదీన కమ్యూనిస్టు పార్టీ జన్మించింది. కామ్రేడ్ మావ్, కామ్రేడ్ లీ-షావ్ చీ యిరువురూ తమ కార్యకలాపాలను ఇక్కడే మొదలు పెట్టారు.

సామ్రాజ్యవాదాన్ని సమూలంగా కూలద్రోయడానికి 1925వ సంవత్సరంలో ప్రథమ సాయుధవిప్లవం జరిగింది. 1927 వ సంవత్సరంలో కార్మికవర్గం అతి సాహసంతో 3 సార్లు యెదురు తిరిగి ఆయుధాలతో పోరాటం సాగించింది. ఈ పోరాటాలలో షాంగ్‌హై పట్టణం ఒకసారి పూర్తిగా స్వతంత్రం పొందిందికూడా. చైనాప్రజల నాగరికత, విజ్ఞానం, భాష తలెత్తి నూతన జీవితం పొందడానికి షాంగ్‌హై పట్టణం యెంతో ముందుకు వచ్చింది. చైనా వాఙ్మయచరిత్రలో ప్రఖ్యాతివహించిన విప్లవగ్రంథకారుడు "ల్యూషాన్" తన కార్యకలాపాలకు ఈ పట్టణాన్నే స్థావరంగా చేసుకున్నాడు. 1930 వ సంవత్సరంలో అభ్యుదయ రచయితలకీ పట్టణం కేంద్రమయింది. వారి సంస్థకూడా యిక్కడే నెలకొనింది.

1949 మే 28 వ తేదీనాడు ఒకలక్ష 50 వేల కొమింటాంగ్ సైనికుల్ని రూపుమాపి, మావ్ సైన్యాలు యీ పట్టణాన్ని విముక్తి చేశాయి. నాటినుండి యీ పట్టణం సర్వతోముఖాభివృద్ధి పొంది సర్వస్వాతంత్ర్యంతో తులతూగుతోంది. పరిశ్రమలలో ఉత్పత్తి 1949 సంవత్సరంలో నూరు పాయింట్లనుండి 1953 లో 282 పాయింట్లకు హెచ్చింది. ఉత్పత్తి విధానంలో యెన్నో అభివృద్ధికరమైన మార్పులు వచ్చాయి. ఇదివరకు ప్రజోపయోగానికి అవసరమైన చిన్న చిన్న ఫ్యాక్టరీలన్నీ నేడు అభివృద్ధిపొంది చైనా ఆర్థిక విధానాని కనుకూలైన యంత్ర సామగ్రిని తయారు చేయడానికి వినియోగ పడుతున్నాయి. పరిశ్రమలలో సోవియటు విధానా లనుకరింప బడుతున్నాయి. ఎంతోమంది ఆదర్శ కార్మికులు పైకివచ్చారు. 1953వ సంవత్సరంలో 256 మంది ఉత్తమోత్తమ కార్మికులు, 14 వేల మంది నిపుణులు తయారయారు. పరిశ్రమల అభివృద్ధికి 37,609 సలహాలను కార్మికులే ఇచ్చారు. వాటిలో 23,689 సలహాలు ఆచరణలో పెట్టబడ్డాయి. 8,504 ముఖ్య సలహాలను అమలు జరిపినందువల్ల 12,548 కోట్ల యెన్నులు (2 కోట్ల 50 లక్షల 96 వేల రూపాయలు) ఉత్పత్తి కర్యో వ్యయంలో తగ్గింది.

ఈ పారిశ్రామిక పునర్నిర్మాణ కార్యక్రమంవల్ల కొమింటాంగ్ పాలననుంచి పారిపోయి పునరావాసంకోసం వచ్చిన ప్రజానీకంవల్ల షాంగ్‌హైపట్టణం అభివృద్ధిచెంది వ్యాపారంలో ప్రఖ్యాతి వహించింది. ధరలు అదుపులోకి తేబడ్డాయి. జీవితావసర వస్తువులకొరతతీరింది. జనోపయోగమైన వస్తువుల ధరలు నిర్దేశింపబడి, లాభాలకోసరం ప్రజలను పీడించే విధానానికి స్వస్తి చెప్పబడింది. చీకటి మార్కెట్టులు, లంచగొండితనం రూపుమాపబడింది. ధరలను కృత్రిమంగా తగ్గించి, పెంచి, తారుమారుచేసే చట్టా వ్యాపారం నిషేధింపబడింది.

యూనివర్సిటీలు, కాలేజీలు మార్పుచేయబడి విద్యావిధానంలో అభివృద్ధికరమైన బోధనాపద్ధతులు ప్రవేశపెట్టబడ్డాయి.

సోవియట్ విద్యాపద్ధతులకు ప్రాముఖ్యత ఈయబడింది. నేడు షాంగ్‌హైలో 14 కాలేజీలు, 214 హైస్కూళ్లు, 1500 ప్రైమరీ స్కూళ్లు ఉన్నాయి. 1953 లో విద్యార్థులసంఖ్య 1949 లో కంటె రెండితలు పెరిగింది. ప్రజల జీవిత పరిమాణాలు అభివృద్ధి పొందాయి. షాంగ్‌హై పరిసరంలోని సీయాంగ్ గ్రామంలో కార్మికుల వసతికోసరం 25 వేల గృహాలు నిర్మింపబడ్డాయి.

ఈ పట్టణంలో 127 నాట్యమండలు లున్నాయి. 35 సినిమా థియేటర్లు, 223 వినోద కేంద్రాలు ఉన్నాయి. అన్ని పారిశ్రామిక పట్టణాలలోవలె యిక్కడకూడా ఒక గొప్ప కార్మిక విజ్ఞాన భవనం వుంది. షాంగ్‌హై ట్రేడ్‌యూనియన్ కౌన్సిల్‌చే ఏర్పాటు చేయబడిన 7 క్లబ్బు లున్నాయి. కార్మికుల సౌకర్యంకోసరం 3 ఆరోగ్య కేంద్రాలు, 4 విశ్రాంతి గృహాలు ఉన్నాయి. ఇవిగాక 17 ఆరోగ్య కేంద్రాలు, 25 విశ్రాంతి గృహాలు తరచుగా కార్మికులు వినియోగించుకునే టందుకు ఏర్పాటు చేయబడ్డాయి. ఇవన్నీ ట్రేడ్ యూనియన్ కౌన్సిలుచే నిర్వహింపబడుతున్నాయి. కార్మికుల పిల్లల సంరక్షణకోసరం 171 శిశుసంరక్షణ కేంద్రాలున్నాయి. ఇందులో కొన్ని, తల్లులు పరిశ్రమల్లో పనిచేస్తూంటే వారి బిడ్డలను పగటిపూట చూచుకొని సాయంత్రం వారికి వప్పచెప్పే టందుకు, తక్కినవి పిల్లలను యెల్లప్పుడూ సంరక్షించేటందుకు వినియోగింపబడుతున్నాయి. ఈ నర్సరీలలో 12,983 మంది బాలబాలికల పోషణ జరుగుతూంది.

మే 21 వ తేదీనాడు మేము కార్మికుల విజ్ఞాన భవనానికి వెళ్లాము. ఇక్కడ చైనా విప్లవచరిత్రకు సంబంధించిన ఛాయాపటాలెన్నో ప్రదర్శింపబడ్డాయి. జపాను ప్రభుత్వ అత్యాచారాల్నీ కొమింటాంగ్ ఘోరాల్నీ రుజువుపరిచే ఫోటోలు అధికంగా వున్నాయి. విప్లవంలో వీరమరణం చెందినవారి, రహస్యంగా కొమింటాంగ్ గూఢచారులచే హత్యగావింపబడినవారి, అసత్య

నేరాలకు ఉరిదీయబడినవారి ఫోటోలు యిక్కడ వున్నాయి. దేశ విముక్తికి పురుషులతోపాటు తమ ప్రాణాల నాహుతి చేసిన యెందరో స్త్రీల ఫోటోలు, వారి సంగ్రహచరిత్రలు ప్రదర్శింప బడ్డాయి.

ఈ మహావీరులలో వాంగ్ - సీయోహావో చరిత్ర చాల విషాదభరిత మయింది. వాంగ్ - సీయోహావో షాంగ్‌హై ఎలక్ట్రిక్ వర్కుషాపులో ఉద్యోగి. చైనా విప్లవ పోరాటాలలో పాల్గొన్నవారిలో ముఖ్యుడు. కార్మిక సంఘాలద్వారా కార్మికులను ప్రజలను మేల్కొల్పి, వారిలో చైతన్యం కలిగించాడు. ఇతణ్ణి కొమింటాంగ్ ప్రభుత్వాధికారులు నిర్బంధించి నానా హింసలపాలు చేశారు. నిర్బంధంలో పెట్టిన బాధలవల్ల యితడు స్పృహతప్పి పడి పోగా, అంతకుముందు సిద్ధంచేసివుంచిన ఒక పత్రంపైన యితడికి తెలియకుండా యితని వేలిముద్రలు తీసుకున్నారు. ఇతడు బాగా చైనాభాష, యింగ్లీషు నేర్చినవాడు. ఇతడికి తెలియకుండా వేలు ముద్రలు తీసుకున్న దొంగపత్రంలో తాను తన నేరం అంగీకరించినట్లు వ్రాయబడింది. ఈ పత్రాన్ని ప్రమాణంగా తీసుకొని కొమింటాంగ్ ప్రత్యేక విచారణ స్థానంలో యితని కురిశిక్ష విధింపబడింది. ఈ విధంగా యెంతో మంది తమ నిండుప్రాణాలను చాంగ్ కై షేకు దుష్పరిపాలనకు బలిచేశారు. వాంగ్-సీయోహావో విచారణలో యేమాత్రము చలించకుండా విప్లవనినాదాలతో జవాబు లిచ్చాడు. ఇతడు ఉరికంబాని కెక్కేముందు తన భార్య కీ క్రింది వుత్తరం వ్రాశాడు. ఆ లేఖకూడా ప్రదర్శనంలో వుంది.

"నేను నీ కెంతో కృతజ్ఞుడిని. నా పై నీ కెంత సానుభూతి వుందో నాకు తెలుసు. నా విషయంలో నీ వెంతో శ్రమపడి కృషిచేశావు. కాని నీ శ్రమ ఫలించకపోయింది. నీ యీ శ్రమ వృథాగా పోదనే నా విశ్వాసం. చట్టవిరుద్ధమైన ప్రత్యేక పోలీసు శాఖ నా అదృష్టాన్ని నిర్దేశించింది. నిరంకుశత్వం, అన్యాయం తాండవించే యీ ప్రపంచంలో అనేక లక్షలమంది నిరపరాధులు

సత్యం కోసం, న్యాయంకోసం పోరాడ్డంలో బలి అయిపోతున్నారు. నే నొక్కడనే యీ అత్యాచారానికి గురికావడం లేదు; కాబట్టి నీవు విచారించవద్దు. నీవు నీ ఆరోగ్యం విషయంలో శ్రద్ధవహించు. పిల్లల విషయంలోకూడ తగిన శ్రద్ధ తీసుకో. వాళ్లకి తమ తండ్రిని యెవరు హత్యచేశారో చెప్పు. తమతండ్రికి జరిగిన యీఘోరాన్ని, అన్యాయాన్ని మరచి పోవద్దని హెచ్చరించు..."

పై లేఖ వాంగ్-సి-యో-హో తన రక్తంతో వ్రాశాడు.

మావ్-లీ-యింగ్ షాంగ్ హై కస్టం కచేరిలో పనిచేసేది. ఈమె విప్లవ సైన్యానికి తోడ్పడింది. ఈమెను జపాన్ గూఢ చారులు నిర్బంధించి రహస్యంగా హత్యచేశారు.

చైనా విప్లవ మహాయజ్ఞంలో చాంగ్ గూఢచారులచేత, జపాన్ రహస్యపోలీసు దళంచేత యెందరో స్త్రీ పురుషులు ఆహుతి చేయబడ్డారు. వీరందరి ఫొటోలు ప్రదర్శనశాలలో ప్రదర్శింపబడి, చూచే వాళ్ళ మనస్సులను కలచివేస్తాయి. ఈ ప్రదర్శనంవల్ల కొమింటాంగ్ ఘాతుక చర్యలు సామ్రాజ్యవాదుల ఘోరకృత్యాలు వెల్లడవుతున్నాయి. ఏ దేశస్థుడయినా, ఏ రాజకీయపార్టీకిచెందిన వాడయినా కన్నీటితో వీరికి జోహారు లర్పించకుండా ముందుకడుగు పెట్టలేడు.

నేను ఇదివరకు అంతో యింతో కవిత్వం చెప్పేవాణ్ణి. పది సంవత్సరాలక్రితం నా కలం మూల పడింది. ఎన్నడూ వ్రాయ డానికయినా యత్నించలేదు. కాని షాంగ్ హైలో యీ ప్రదర్శనం చూచిన తరువాత ఈ క్రింది పద్యాలు దొర్లాయి:

"ముష్కర సామ్రాజ్యమూకలు చెలరేగి
భార్యభర్తల నెడబాపునపుడు,
పసిపాపలను మాతృవక్షఃస్థలమునుండి
విడదీసి రక్తంబు పీల్చునపుడు,

వృద్ధుల చెరబట్టి, వివిధహింసల పెట్టి
మారణకృత్యాల మసలునపుడు,
శ్రామికజీవుల సంపదల్ హరియించి
కొల్లగా లూటీలు గొట్టునపుడు
గగనతలమెల్ల చీకట్లు గ్రమ్మునపుడు
ఆశ నశియించి ప్రజలు అల్లాడునపుడు
అవతరించెను రక్తవర్ణంపు తార
చైన ప్రజలను దరిజేర్చు సమయ మనుచు

అతడె మా-సె తుంగ నేడు మహాత్ముడితడు
చైనప్రజలకు గురువును జనకుడితడు
ఇతడు చిరజీవియగుగాక, నితని ప్రాపు
వడసి లోకంబు శాంతిని వడయుగాక.

ఒకనాడు నదులెల్ల యుప్పొంగి ప్రవహించె
వనితల కన్నీటి వరదతోడ,
ఒకనాడు నదులెల్ల యురవడి పరువిడె
క్షాత్ర వీరోష్ణ రక్తంబుతోడ,
ఒకనాడు నదులెల్ల యుప్పొంగి తెగబారె
శ్రమజీవుల దేహ చెమటతోడ,
ఒకనాడు నదులెల్ల నుగ్రరూపు వహించె
దేశభక్తుల రక్త దీప్తితోడ.

తల్లడిల్లెను లోకంబు, ధరణి వడకె
చైన గోడ్పడెన నేడు విచారభార
మెదల బరువెత్తె, మిత్రుల మెదడు లదిరె,
అట్టి తరుణాన విప్లవ మలముకొనియె.

దేశభక్తుల త్యాగంబు, దేశప్రజల
ఐకమత్యంబు కార్మిక హర్ష బాష్ప

సంకులంబయి నేడిట చైనన నదులు
పారుచున్నవి శాంతిప్రవాహతతులు.

ప్రజలపాలిట భాగ్యవారాశియై చైన
పీపుల్స్ పబ్లికు వెలయుగాక,
ప్రజలపాలిట భాగ్యవర్ధనుండయి మా-సె-
తుంగు సత్కీర్తి చెలంగుగాక,
ప్రజలపాలిట భాగ్యవర్ధిష్ణు, కార్మిక
జనముల బలము లె సంగుగాక
ప్రజలపాలిటభాగ్య పంటలే రైతుల
బలము లజ్రసంబు వెలయుగాక

శాంతిసౌఖ్యంబు, అభివృద్ధి, సర్వసమత
బలము, ప్రేమయు, విజ్ఞాన, కలిమిఁ తోడ
చైనయొప్పారిజగముల శాంతికొరకు
పడెడు శ్రమలోన విజయంబు వడయుగాక."

ఆంధ్రభాష తెలియని ఆ దేశంలో నేనో కవిగా చెల్లిపోయాను. ఈ పద్యాలను నాటిరాత్రి "బాంక్వెట్"లో (విందు) చదివి, అర్థాన్ని ఇంగ్లీషులో చెప్పాను. మా దుబాసీ కామ్రేడ్ "చీ" చైనాభాషలో పండితుడు, కవి. అతడు నా పద్యాల్ని చైనా భాషలోకి అనువదించాడు. అవి చదివినప్పుడు సభా వేదిక హర్ష ధ్వానాలతో మారుమ్రోగింది. మైక్రోఫోను దగ్గరనుంచి నా స్థానానికి వస్తూంటే, సోవియట్ ప్రతినిధివర్గ కార్యదర్శి విక్టర్ సకోవిచ్ యెదురుగావచ్చి నన్ను అభినందించాడు. అఖిల చైనా ట్రేడ్ యూనియన్ల ఫెడరేషన్ ఉపాధ్యక్షుడు లీ-సిం-గీ నన్ను గాఢంగా కౌగలించుకున్నాడు. నేను చదివిన పద్యాల కాగితం ఆయనకు గౌరవపూర్వకంగా నివేదించాను. రెండోరోజు ఈపద్యాలను వాటి యింగ్లీషు తర్జుమాను బ్రాడ్‌కాస్ట్ రికార్డియ్యవలసి

నదిగా షాంగ్‌హై బ్రాడ్ కాస్టింగ్ అధికారులు కోరారు. చైనా దేశంనుంచి ఆంధ్రలో ప్రసారం చేయడం ఇదే తొలిసారేమో! తరువాత చైనా విషయంలో నా అభిప్రాయాల్ని తెలుపుతూ ఒక బ్రాడ్‌కాస్టు ఉపన్యాసం ఈయవలసిందని కూడా అడిగారు.

షాంగ్‌హైలో వున్నప్పుడు సోవియట్ ట్రేడ్‌యూనియన్ కౌన్సిలు మాస్కోనుంచి నన్నూ, బినయ్‌రాయినీ రష్యాకాహ్వానించింది. కాని, పాస్‌పోర్టు లేనందున రష్యాకు వెళ్ళే అవకాశం తప్పిపోయింది.

షాంగ్‌హైలో భారత ప్రభుత్వపు దౌత్య కార్యాలయం వుంది. భారత కాన్సలు జనరల్ శ్రీ ముఱుగేశంగారితో పరిచయం చేసుకున్నాము. ఆయన మమ్ములనెంతో ఆదరించి గౌరవించారు. భారత ప్రతినిధులందరినీ ఒక రాత్రి విందు కాహ్వానించారు. ఆయన సెక్రటరీ చౌదరీ సతీమణి, శ్రీ ముఱుగేశం సతీమణి యిరువురూ మమ్మెంతో సత్కరించారు. వారిండ్లలోవున్న కొద్దిగంటలసేపు మేము మా స్వంత ఇండ్లలో వున్నట్లే గడిపాము. చైనా ప్రజా విజయాల విషయంలో వీరందరూ చాలా సదభిప్రాయాలను వెల్లడించారు.

షాంగ్‌హై మెషీన్ టూల్ ఫ్యాక్టరీ చాల గొప్పది. ఇందులో చైనాకు కావలసిన వివిధరకాల యంత్రసామాగ్రి నిర్మింపబడుతోంది. ఇక్కడ కార్మికుల ప్రతినిధులతో పరిచయం కలిగింది. వాళ్లు కొమింటాంగ్, జపాన్ పరిపాలనలో పడ్డపాట్లన్నీ చెప్పారు.

పది సంవత్సరాలలోపు పిల్లలనుకూడ పరిశ్రమలలో చావమోది చాకిరీచేయించేవాళ్ళని, యీ క్రౌర్యానికితట్టుకో లేక యెంతోమంది చనిపోయారని చెప్పారు. స్త్రీ కార్మికులకు ప్రసూతిసౌకర్యాలు సెలవులులేకపోవడంవల్ల యెంతోమంది స్త్రీలు యంత్రాల ప్రక్కనే పనిచేస్తూ ప్రసవించేవాళ్ళని, ఎంతోమంది శిశువులు తగినపోషణ, మందు మాకులు లేక మృత్యువాత పడేవాళ్ళని చెప్పారు. తల్లులు కూడ, ప్రసవించగానే పనిలో నియోగింపబడడంవల్ల నానావిధ

మైన రోగాలకు పాల్పడి అకాల మరణాల పాలౌతూంటే యజమానులకు, ప్రభుత్వాధికారులకు చీమకుట్టినట్లయినా తోచేది కాదని తమ అనుభవాన్ని చెప్పారు. ఎంతోమంది ఫ్యాక్టరీ పరిసరాలలో చనిపోతూవుంటే మునిసిపాల్టీవారు కుక్కల నీడ్చినట్లు యీడ్చుకొనిపోయేవాళ్ళని, ఆవిధంగా మరణించిన వారిపట్ల యెటువంటి సానుభూతి చూపబడేదికాదని తెలిపారు. వయసులో వుండే స్త్రీ తిండి బట్ట లేక పరిశ్రమలలో కూలికివస్తే, వాళ్ళని నిర్బంధించి, వాళ్ళ మానాన్ని కొల్లగొట్టిన ఉదంతాలెన్నో వున్నాయని అన్నారు. రోజుకు 14-15 గంటలు పనిచేసినా కడుపునిండా తిండి, బట్ట లేక అల్లాడిపోయారనీ బ్రతుకుతెరువు లేక స్త్రీలు వ్యభిచారానికి, పురుషులు - భిక్షాటనకు పాల్పడే వాళ్ళనీ కూడ తెలిపారు.

విముక్తి తరువాత యీ దుర్భర పరిస్థితులకు పూర్తిగా స్వస్తి వేస్పబడి కార్మికవర్గం తలెత్తుకుని సగౌరవంగా తిరిగే అవకాశం లభించిందనీ, వేతనాలు అభివృద్ధి చెంది, తిండికి బట్టకు అగచాట్లు పడే దుర్దినాలు తొలగిపోయాయని, తమ కన్నివిధాల సౌకర్యాలేర్పడి వృద్ధాప్యంలో గాని ఉద్యోగం నుంచి విరమించుకొన్న తరువాత గాని పూటగడవదనే భయంలేకుండా తగిన సంరక్షణలేర్పడ్డాయని, గంటల పరిమితి, విశ్రాంతికి సెలవులు, జబ్బుపడినప్పుడు చికిత్సకు అనుపానాలకు యేర్పాట్లు, పిల్లల విద్యా విషయంలో తగిన శ్రద్ధ యేర్పడి తమ జీవితాలు సుఖంగా గడుస్తున్నాయని చెప్పారు.

23 వ తేదీనాడు మేమంతా కులాసాగా యాంగ్సీనదిపై స్టీమరులో విహారానికి వెళ్ళాము. ఇక్కడ పాంపోనది యాంగ్సీ నదితో కలుస్తుంది. ఇది ఒక నదిగా కాకుండా సముద్రంగా గోచరిస్తుంది. స్టీమరుమీద యెంతోమంది బాలబాలికలు నృత్యంతో గానంతో కులాసాగా కాలం గడిచేటట్లు మమ్మాదరించారు.

మేము చూచిన ప్రతిపట్టణంలోను ఒపేరాలు (నాటక శాలలు) ఉన్నాయి. ఎన్నో సినిమాహాలు లున్నాయి. మన దేశంలో లాగే చైనాలో కూడ భరతనాట్యం వంటిది ఉంది. అద్భుతమైన క్రీడలు ప్రదర్శిస్తారు.

షాంగ్‌హై నుంచి మేము మా యాత్రలో ఆఖరు పట్టణమైన "చైనా భూతలస్వర్గం" అని పేరుపొందిన హాం-చోకి వెళ్ళాము.

# 9

# "భూతలస్వర్గం" హాంచో నగరం

మే 24 వ తేదీ మధ్యాహ్నం షాంగ్‌హైనుంచి హాంచో పట్టణానికి ప్రయాణ మయ్యాము. సాయంకాల మయ్యేసరికి హాంచో చేరుకున్నాము. ఇక్కడకూడ కార్మిక ప్రతినిధులందరికీ ఘనమైనస్వాగతం ఇచ్చారు. ఈ నగరానికి "భూతలస్వర్గ"మని పేరు. ఈ పట్టణం నిజంగా స్వర్గంలాగే వుంది. హాంచో పశ్చిమకాసారం చైనా ప్రకృతి శోభకు పేరువడసింది. ఇది గొప్ప ఆరోగ్య కేంద్రం. ఇక్కడ అనేకమైన శానిటోరియాలు, ఆరోగ్య, విశ్రాంతి కేంద్రాలు ఉన్నాయి. హాంచో కుటీర పరిశ్రమలకు, లలితకళలకు చాల ప్రఖ్యాతి వడసింది. వివిధ దేశాల నుంచి ప్రతినిధి వర్గాలు చైనా పర్యటన కొనసాగించిన తరువాత యిక్కడికివచ్చి ప్రకృతి శోభను తిలకించి తన్మయులై పోతారు. మూడు నాలుగు రోజుల విశ్రాంతితో తమ అలసటను పూర్తిగా పోగొట్టుకొని, యిక్కడనుంచి కాంటన్ పట్టణానికి వెళ్లి తమ తమ దేశాలకు తిరిగి వెళ్ళిపోతూ వుంటారు. ఇక్కడ చైనా పింగాణీ సామగ్రి, సిల్కు అల్లికపు పనితనం మెచ్చ తగినవి. సిల్కు బట్టపై బొమ్మలను అల్లడంలో వీళ్ళ నైపుణ్యం అసమానంగా వుంటుంది.

హాంచో, (చెకియాంగ్ రాష్ట్రా)నికి ముఖ్యనగరం. చైనా పురాతన చారిత్రక స్థలాలలో అతిముఖ్యమైనది. వైజ్ఞానికంగా యీ పట్టణమెంతో ప్రసిద్ధిచెంది రెండువేల సంవత్సరాలు బౌద్ధ మతస్థులకు మహాక్షేత్రంగా విలసిల్లింది.

పశ్చిమ కాసారం చుట్టూ అనేక చిన్న కాసారాలున్నాయి. ఇవన్నీ కూడ ఆనందాన్ని వెదజల్లుతూవుంటాయి. వీటిచుట్టూ దట్టమయిన వృక్షాలతో నిండిన పర్వత పంక్తులున్నాయి. ఇంతటి దృశ్యం యితర ప్రదేశాలలో అగుపించదు. ఇక్కడి పర్వత పంక్తులు ఒకటికంటె యింకొకటి ఎత్తయి స్వర్గానికి సోపానా లమర్చినట్లు తోస్తుంది. బహుశా అందువల్లనే దీనికి భూతలస్వర్గం అనే పేరు కలిగిందేమో! పశ్చిమ కాసారం గర్భంలో అనేక ద్వీపాలున్నాయి. ఇది సర్వకాలాలలో జలపూరితమై పరిపూర్ణంగా, ప్రశాంతంగావుంటుంది. దీనిచుట్టూ వుండే పర్వత పంక్తులలో బౌద్ధమందిరాలు, సుందరవనాలు వున్నాయి. చిన్నచిన్న నౌకలలో విహారంచేస్తూ, ప్రకృతి రామణీయకతను తిలకిస్తూంటే, మనిషి తన్నుతాను మరిచిపోయి ప్రకృతిలో లీనమైపోతాడు, ఆనందతన్మయత్వంలో మహోన్నతభావాలు మొలకెత్తుతాయి. పసితనం ఆవహించి, మాతృదేవత అంకపాళిలో జోకొడుతూ వుంటే అనుభవించే ఆనందాన్ని ప్రకృతి ఒడిలో మళ్ళీ ఒకసారి అనుభవిస్తాడు.

దీనికి ప్రక్క యింకోకాసారం మధ్య చింగ్ రాజవంశంలోని కాంగ్-షీ-చక్రవర్తిచేత నిర్మింపబడిన రాతిమండపం వుంది. "ప్రకృతి శోభను అనుభవించాలి అంటే మౌనం వహించాలి" అని చెక్కబడ్డ రాతిశాసనంకూడవుంది. ఇటువంటిసుందర తటాకాలు పదిదాకా వున్నాయి. ఒక్కొక్కటి ఒక ప్రత్యేకత కలిగి, మనస్సు నాకర్షించి ప్రపంచాన్ని మరిపిస్తుంటాయి.

ఒక్కొకదాంట్లో రకరకాల చేపలుపోషింపబడుతున్నాయి

క్రీస్తు 470 సంవత్సరాలకు పూర్వం "యోపహ్" చక్రవర్తిచే నిర్మింపబడ్డబౌద్ధమందిరం వుంది. టీన్-చో, చంగ్‌టిన్-చో. షాన్‌టిన్-చో అనే మూడు మందిరాలుకూడ వున్నాయి. వీటి అర్థం: "ప్రథమ హిందూ ఆలయం, మధ్య హిందూఆలయం, అగ్రహిందూ ఆలయం" అని విన్నాను. ఇవన్నీకూడ చాలశతా

బ్దాలనాటి పురాతన మందిరాలు. ఇక్కడ బౌద్ధమందిరాలు గుహా దేవాలయాలు ఎల్లోరా శిల్పకళా సంపదను జ్ఞప్తికితెస్తూ వుంటాయి.

"లి - యూహాఘా" అంటే పక్షిజ్వాందిరం అన్నమాట. ఇది ప్రపంచం నాల్గుమూలల నుంచీ యాత్రికులను ఆకర్షించేది. ఇంతేకాకుండా స్వర్గం నుంచి, పాతాళంనుంచి కూడ తైర్థికు లరుదెంచే వాళ్ళనీ, అందువల్లే దీనికి "పక్షిజ్వాందిరం" అనే పేరు కలిగిందనీ చెప్పారు. ఈ ఆలయం సూంగ్ వంశస్థులచేత నిర్మింపబడింది. ప్రభుత్వం యెంతో వ్యయాన్ని భరించి ఈ ఆలయాన్ని కాపాడుతూంది.

హాంచోలో సేనాపతి ఆలయం ఒకటుంది. ఇది కూడ శిల్పకళలో ఇతర ఆలయాలకు జోడుగా వుంటుంది. ఒక దేశభక్తుడైన సైనికాధిపతి గౌరవార్థమిది నిర్మింపబడింది. అందులో ఎత్తైన అతని విగ్రహం స్థాపింపబడి వుంది. కొన్ని శతాబ్దాలకు ముందు చైనాపై శత్రురాజులు దండెత్తినపుడీ సేనాధిపతి వారి నెదిరించి, తనదేశ సంరక్షణకోసరం హోరా హోరీగా పోరాడాడు. మంత్రులీతనిపై కుట్రపన్ని శత్రువులతోకలసి ద్రోహంచేసినందువల్ల ఇతడు పట్టుబడి వారిచేతులలో హత్యగావింపబడ్డాడు. చక్రవర్తి కీవిషయం తెలిసి, అతడి దేశభక్తికి, శౌర్యానికి కానుకగా ఈ ఆలయం నిర్మించాడు. దీని అవరణలోనే యితని సమాధికూడ వుంది. సింహద్వారం ప్రక్కనే ద్రోహంచేసిన మంత్రుల యినుప విగ్రహాలున్నాయి. సమాధికి వెళ్లేవారంతా యీ విగ్రహాలపైన ఉమ్మేస్తూ వుంటారు. ఈ కృతఘ్నులు చేసిన ద్రోహానికిది శిక్షగా విధింపబడింది.

అమితాబ్ బుద్ధమందిరం కూడ చాల పురాతనమైనదేకాక, చారిత్రకంగాకూడ ప్రాముఖ్యం పొందింది. ఇక్కడవుండే విగ్రహాలు, దీని పరిసరాలు అన్నీ భారత దేశంలోని దేవాలయాలను జ్ఞప్తికి తెస్తాయి. ఈ అలయంలోకి వెళ్ళినప్పుడు బినయ్‌రాయ్ నన్నో

పరీక్ష చేశాడు. అక్కడుండే బుద్ధ విగ్రహానికి ప్రణామం చేయవా అని ప్రశ్నించాడు.

బుద్ధభగవానుడిముందు మోకరిల్లడం నేను మతవిశ్వాసం వదలని ఛాందసుడననే తలంపు గలిగిస్తుందనే అభిప్రాయం వుండి వుండవచ్చు. లేదా నేను సంశయిస్తానని అయినా తలచి వుండవచ్చు. నేను నిస్సంకోచంగా బుద్ధునిముందు ప్రణామంచేసి, నా కాయనమీాదవుండిన భక్తిగౌరవాలను దాపరికంలేకుండా ప్రదర్శించాను. నేను భగవంతునిపైన, మతంపైన అచంచలమైన విశ్వాసం కలవాళ్ళలో ఒకడిని. కార్మికోద్యమంలో యించుమించు 28 సంవత్సరాలు గడిపి, నేనింకా నా మతవిశ్వాసాల విషయంలో అభిమానాన్ని, విశ్వాసాన్ని వదలుకోవలసిన అవసరం కలగలేదు.

బుద్ధుడు ప్రపంచ విప్లవకారులలో ఒకడని, ఆయన వర్గ రహితమూ జాతిభేదమూలేని విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని స్థాపించడానికి తన సర్వస్వం త్యాగంచేసి ప్రపంచానికి నూత్న వెలుగు ప్రసాదించాడనీ నా అభిప్రాయం. రెండువేల 5 వందల సంవత్సరాలకు పూర్వం ప్రపంచమంతా అజ్ఞానంలో, అమాయకత్వంలో మునిగి చీకటిముసుగులో తన్నులాడుకుంటూ వుండి, స్వలాభం కోసరం ఒకరి గొంతులొకరు కోసుకుంటూ వుండే సమయంలో, ప్రపంచాన్ని అంధకారంనుంచి వెలుగు కీడ్వడానికి భారతదేశం యీ మహానుభావుని ప్రసాదించింది. ప్రపంచాన్నంతా ప్రేమసూత్రంలో బంధించి అహింసా సిద్ధాంతంతోను, పరస్పర సహనంతో మెలగడాని కవకాశం కల్పించి, మానవులను దేవతలుగానూ, ప్రపంచాన్ని స్వర్గంగానూ మార్చడానికీమహోత్తమ పురుషుడు యత్నించి ప్రపంచానికి మార్గదర్శకు డయ్యాడు. అతడివల్ల భారతదేశమే కాకుండా ప్రపంచమంతా పవిత్రమయింది. భారతీయుడనైన నేను ఏ దేశంలో నయితేనేమి, ఎవరిమధ్య నయితేనేమి ఆయన పాదాలదగ్గర మోకరించడానికి వెనుదీయడం నాఅజ్ఞానాన్ని,

అహంకారాన్ని సూచిస్తుందే కాని, నా ప్రతినాళంలో ప్రవహించే భారతీయ సంస్కృతిని, నాగరికతను సూచించదనే నా విశ్వాసం. ఈ విషయంలో మనం సంకోచిస్తున్నా చైనా సంకోచించక పోవడం గర్వింపతగిన విషయమని రాయ్‌ని హెచ్చరించాను. నిజం మాట్లాడాలంటే ప్రపంచ విప్లవకారులకీ, తత్వవేత్తలకీ, ప్రవక్తలకీ ఈయన మార్గదర్శకు డనడంలో అసత్యమేమీ లేదని నా విశ్వాసం అన్నాను. రాయ్ అప్పుడు కాకపోయినా తరువాత నన్ను శ్లాఘించాడు.

హాంచోలో సిల్కు బట్టలపైన బొమ్మలను అల్లే పనితనం చాల నైపుణ్యంతో కొనసాగింపబడుతోంది. వీళ్ళ చిత్రాలు ఫోటోగ్రాఫుల కంటె జీవకళ ఉట్టిపడేటట్లు వుంటాయి.

భూతల స్వర్గమైన ఈ పట్టణంలో తటాకతీరంలో చాంగ్ కై షేకు తన విశ్రాంతికి, సౌఖ్యానికి ఒక గొప్ప భవనం నిర్మించుకున్నాడు. ఇతడి అనుచర బృందంకూడ యితణ్ణనుసరించి తమ భోగంకోసరం తగిన మందిరాలు నిర్మించుకున్నారు. చాంగ్ భవనంలోకి కాలు పెట్టడానికి ప్రజలెవ్వరికీ గుండె లుండేవికావు. విముక్తి తర్వాత ఈ భవనం పిల్లలశరణాలయంగా మార్చబడింది. ఈ పట్టణంలో కార్మికులకు, ప్రజలకు యెన్నో ఆరోగ్యశాలలు, విశ్రాంతి గృహాలు వున్నాయి. ఒకప్పుడు కొమింటాంగ్ నాయకులకు, వారి ఆశ్రితులకు మాత్రమే అందుబాటులో వుండిన ఈ పట్టణం నేడు ప్రజాసామాన్యానికంతా అందుబాటులో వుండేటట్టు చేయబడింది.

మేము చైనాలో వున్నంతకాలం ప్రతిపట్టణంలోను సినిమా నాటక ప్రదర్శనా లెన్నో చూచాము. ఈ ప్రదర్శనాలలో చైనా నాగరికతను సూచించే సభ్యుల ప్రవర్తన చాల ఉత్తమంగా వుంది. అతిథులు హాలులో ప్రవేశించేటప్పుడు సభ్యులంతా (వేలమంది) లేచి నిలబడతారు. అతిథులను ఆహ్వానిస్తూ హర్ష సూచకంగా తాళంవేసినట్లు చప్పట్లు కొడతారు. అతిథులంతా ఆసీనులయ్యే

వరకు తాము కూర్చొంటారు. హాలునుంచి వెళ్ళేటప్పుడుకూడ యిదే విధంగా ప్రవర్తిస్తారు. తమకు నచ్చినపాటగాని, జంత్రవాయిద్యంగాని మళ్ళీ వినాలంటే, "వన్స్‌మోర్" అని కేకలువేయరు. ఈలలు కొట్టరు. మెచ్చుకుంటూ ఉత్సాహం కలిగించే కరతాళ ధ్వనిలాగ కాకుండా ఒకదరువులో చప్పట్లు కొడతారు. నటకులు, గాయకులు రంగంమీదికి మళ్ళీ వస్తారు. తెరలేస్తుంది. సభ్యుల కోర్కెనుమన్నిస్తూ, తిరిగి ప్రదర్శిస్తారు. వ్యవధి లేకపోయినా, వీలు కాకపోయినా, నటకులు, గాయకులు వరసగా నిలబడి శిరస్సు వంచి తమ నిరాకృతి తెలియబరుస్తారు. తెరవాలుతుంది. సభ్యులలో యెటువంటి గందరగోళం జరగదు. ఒకవేళ సభ్యులు మరీ పట్టుబడితే, తెరవాలగానే దరువులో మళ్ళీ చప్పట్లు ప్రారంభిస్తారు. నటకు లీసారి నిరాకరించడం సహజంగా జరగదు. ఒకవేళ జరిగినా సభికులు యెటువంటి పట్టుదల చూపరు. ఈవిధమైన సభ్యవర్తన నటకులకు, గాయకులకు కాకుండా కళకు, విజ్ఞానానికి గౌరవం చూపడం అని నా అభిప్రాయం.

నవచైనాలో, నశించడానికి సిద్ధంగా వుండిన ఉత్తమ కళలన్నీ మళ్ళీ జీవం పోయబడి అభివృద్ధిపొందుతున్నాయి. కళలపట్ల, కళోపాసకులపట్ల చైనా ప్రజల ఆదభిమానాలు ఆదర్శప్రాయంగా వున్నాయి. అనేక వేల సంవత్సరాల నాటి వాఙ్మయం, కళ, సంస్కృతి, విజ్ఞానం పడిపోకుండా పోషిస్తున్నారు. చరిత్రాత్మకమైన పురాతన కథలను కూడ విస్మరించడం లేదు.

సినిమాలు, నాటకాలు కేవలం ఉల్లాసం కోసరం, కళాపోషణకోసరం కాకుండా, నేటి చైనా పరిస్థితుల కనుగుణ్యాంగా వుండి, ప్రజలనుద్బోధించి, వాళ్ళ నైతిక, సాంఘిక జీవితాలను సరిదిద్ది ఆదర్శప్రాయంగా వుండేటట్లు చేయడాని కుపకరిస్తున్నాయి.

సామ్రాజ్యవాదుల దురాక్రమణలో కొమింటాంగ్ పరిపాలనలో, ఐశ్వర్యవంతులు, యజమానులు, భూస్వాములు, ఉన్న

తాధికారులు ప్రజల మానప్రాణాలను తమ విలాసంకోసరం యేవిధంగా అపభ్రంశం చేసిందీ, వాళ్ళ ఆస్తులనేవిధంగా దోచుకొన్నదీ, ప్రజలు తిండికీ బట్టకూ లేక యేవిధంగా అల్లాడిపోయిందీ, యివన్నీ నాటకాలు, సినిమాలలో ప్రజలు మరచిపోకుండా ప్రచారం కొనసాగుతోంది. విముక్తిచెందిన తరువాత శాసనాలు మారి ప్రజల హక్కులపట్ల యేవిధంగా శ్రద్ధవహించుతున్నదీ, ప్రజల ఆత్మగౌరవంపట్ల ఎంత శ్రద్ధవహించిందీ, అధికారుల యజమానుల, దౌర్జన్యాలకేవిధంగా స్వస్తిచెప్పిందీ, నిరంకుశవిధానాన్ని రూపుమాపి ప్రజాస్వామ్యాన్ని యేవిధంగా నెలకొల్పిందీ తెలియపరచే విషయాల కెక్కువ ప్రాముఖ్యతవుంది. ప్రజల ఐకమత్యం, కట్టుబాటు సడలకుండా వారందరినీ ప్రేమపాశాలతో బంధించి పరస్పర సహకారంతో అభివృద్ధిపొందడానికీ, మార్గం చూపడానికీ సినిమాలు, నాటకాలు రెండూ ఉపయోగపడుతున్నాయి.

చైనాదేశంలో ఒకప్పుడు చాల ప్రాముఖ్యత వహించిన ఆంగ్లభాషకు నేడిక్కడ తావులేదు. ఆంగ్లచిత్రాలు చైనాదేశంలో అడుగు పెట్టడంలేదు. సినిమాకళ కేవలం ధనార్జనకే కాకుండా ప్రజా ప్రబోధానికి యెక్కువ శ్రద్ధ చూపుతోంది.

హాంచో పట్టణం మా కార్యక్రమంలో ఆఖరి పట్టణం. ఇక్కడ నుంచి యితర దేశాల ప్రతినిధులంతా తమ తమ దేశాలకు ప్రయాణమయ్యారు. మేమూ మన దేశానికి ప్రయాణ మయ్యాం. కామ్రేడ్ పా-నీ-ఫంగ్ కామ్రేడ్ చీ - మమ్మల నునుసరించి వచ్చారు. పెకింగ్ రైల్వే స్టేషన్‌లో అఖిల చైనా కార్మిక ఫెడరేషన్ (ఆల్ చైనా ఫెడరేషన్ అఫ్ ట్రేడ్ యూనియన్సు) నాయకులు మాకు వీడ్కోలిచ్చారు. వారు మాకు చూపిన ప్రేమ, సౌహార్ద్రం మరపురాని విషయాలు. పెకింగ్‌నుంచి కాంటన్‌కి, అక్కడనుంచి షంగన్ పొలిమేరలకి వచ్చాము. కాంటన్ పట్టణంలోని కార్మికసంస్థలనాయకులు మాకు వీడ్కోలొసగడానికి రైల్వేప్లాటు

ఫారంమీదికి వచ్చారు. నవచైనా సరిహద్దులలో మమ్మల్ని వీడ్కోలిచ్చినప్పుడు షా,చీ-యీా యిరువురు గాఢంగా కౌగలించు కొన్నారు. వారిద్దరికళ్ళూ అశ్రుపూరితమయ్యాయి. మేంకూడ వాళ్ళని విడవలేక కొంతసేపు విచారించాము. మేము చైనాలో ఆరువారాలపాటున్నా, అనేక సంవత్సరాలనాటి ప్రాణస్నేహితుల లాగే, ఆత్మబంధువులలాగే మెలిగాము. నవచైనా సరిహద్దులలో మా ప్రయాణ సదుపాయాల విషయంలో బాధ్యతవహించటానికి కౌలూన్‌నుంచి, న్యూచైనా న్యూస్‌ఏజెన్సీనుంచి కొందరుసోదరులు వచ్చారు. వీళ్ళకుకూడ మా కృతజ్ఞతాపూర్వక వందనా లర్పిస్తూ హాంకాంగ్ ప్రవేశించాము. హాంకాంగ్ నుండి జూన్ 10 వ తేదీ ఉదయం 10 గంటలకు బి. ఓ. ఏ. సి. విమానంలో బయలుదేరి అదేదినం సాయంత్రం 8 గంటలకంతా కలకత్తా పట్టణం చేరుకొన్నాము.

## 10

## చైనాప్రజల మహోన్నత ఆశయాలు

చైనా ప్రజలు అతిథులపట్ల చాల సభ్యతతోనూ, గౌరవం తోనూ ప్రవర్తిస్తారు. మత, రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాలలో యెంతటి అభిప్రాయ భేదాలున్నా, అవి అతిథులపట్ల మెలగవలసిన సుహృద్భావాని కేమాత్రమూ అడ్డురావు. తమ దేశంలో వున్నంత కాలమూ వారి యోగక్షేమాల విషయంలోనూ, ఆరోగ్యం విషయంలోనూ అత్యంత శ్రద్ధతో కనిపెట్టి వుంటారు.

చైనా విప్లవంలోనూ, తరువాతా సోవియట్ యూనియన్ యెంతో సహాయ మొనర్చింది. చైనా ఆర్థిక పునర్నిర్మాణానికి, పరిశ్రమల అభివృద్ధికి, సైనిక బలానికి, సంరక్షణకు, వలసిన యంత్రాలు, పరికరాలు సహాయ మొనర్చడమే కాకుండా, సోవియట్ యూనియన్ చైనా కార్మికులను తర్ఫీదు చేయడానికి నిపుణులనేకమందిని సహాయంగా పంపింది; చైనా పునర్నిర్మాణ కార్యక్రమంలో సర్వతోముఖాభివృద్ధి కెంతో అండగా నిలిచింది. చైనా కష్ట సుఖాలలో సంపూర్ణ సానుభూతినిచూపి, చైనా ప్రజలపట్ల విశ్వాసంతోటి, మిత్రత్వంతోటి మెలగడంవల్ల సోవియట్‌రష్యా, నవచైనాలమధ్య దృఢస్నేహం, పరస్పర గౌరవం వెల్లివిరుస్తు న్నాయి. చైనా నిర్మించబూనుకొన్న ప్రాజెక్టులెంతో కష్టతరమైనవిగా వున్నాయి. ఎటువంటి క్లిష్టసమస్యలనైనా యెదుర్కోడానికి చైనా ప్రజలకు సోవియట్ ప్రజలు అండగా నిలుస్తున్నారు.

ఈ పరిస్థితులలో ఈ రెండు దేశాలమధ్య దృఢతర స్నేహబాంధ వ్యాలుండడం ఆశ్చర్యకరమైన విషయంకాదు.

భారతదేశం చైనా ప్రజల కేటువంటి ఆర్థికసహాయం చేసే స్థితిలోనూ లేదు. అయినా చైనా ప్రజలు భారతీయులపట్ల విశేష ప్రేమతో వర్తిస్తారు. చైనా ప్రజలపట్ల భారతీయుల ప్రేమ విశ్వాసాలు, సుహృద్భావమూ, ఐక్యరాజ్య సమితిలో నవచైనా ప్రవేశానికి భారతదేశంచేసే నిరంతర కృషి, కొరియా, ఇండోచైనాలలో శాంతికొరకు భారతదేశం చేసిన కృషి, భారత ప్రభుత్వ విదేశాంగ నీతి, నెహ్రూ పండితుని వ్యక్తిత్వం, భారత రాయబారుల సుహృత్ప్రవర్తన – ఇవన్నీ భారతీయులను, చైనీయులను సన్నిహితం చేశాయి. భారత ప్రభుత్వం నవచైనా ప్రభుత్వం పట్ల చూపే గౌరవం, స్నేహం భారతీయులకు చైనా ప్రజలపట్ల గల సానుభూతికి చిహ్నంగా వుంది. భారతదేశం శాంతి, అభ్యుదయాలను కాంక్షిస్తున్నదనీ, అంతర్జాతీయ యుద్ధోన్మాదుల చదరంగపు ఎత్తులలో ఒక భటునిగా వర్తించదనీ చైనా ప్రజలు ఆశిస్తున్నారు. అందువల్ల హోదాలో, గౌరవంలో సోవియట్ యూనియన్‌కి ప్రథమస్థానం వున్నా, భారతదేశానికి సమాన గౌరవ ప్రపత్తులున్నాయి. సహజంగా శాంతిని కాంక్షించే ప్రపంచ ప్రజానీకాన్నంతా నవచైనా తన మిత్రవర్గంలో చేర్చుకుంటుంది. అందులో ప్రతిదేశంయొక్క విధానాన్నిబట్టీ, ఆదర్శాన్నిబట్టీ దాని ప్రత్యేకత, విశిష్టత గుర్తింపబడుతుంది. భారత ప్రతినిధు లెక్కడికి వెళ్ళినా ప్రజలు హర్షం వెలిబుచ్చుతూ వుంటారు. చైనా ప్రజలకు భారతీయుల చరిత్ర, నాగరికత, విజ్ఞానం, సంస్కృతి, కళ సమగ్రంగా తెలుసుకోవాలనే అభిలాష వుంది.

భారతదేశం అంతర్జాతీయ యుద్ధప్రచారకుల జట్టులో కలవదనీ, ప్రపంచ శాంతికి ఆసియా స్వాతంత్ర్యతకి తన సర్వశక్తిని వినియోగిస్తుందనే అభిప్రాయం చైనీయులకున్నదని నా చర్చలలో గ్రహించాను.

అనేక దశాబ్దాలు భారతదేశంలాగే చైనాకూడ సామ్రాజ్య వాదులకు పాదాక్రాంతమై ఆర్థికంగా, వైజ్ఞానికంగా కొల్లగొట్ట బడింది. అనేకమంది దేశభక్తులను బలియిచ్చి, అపరిమితమైన త్యాగంచేసి, అనేక సంవత్సరాలు విప్లవాన్ని కొనసాగించి చైనా స్వాతంత్ర్యం పొందింది. విదేశ పాలనలోని కష్టనిష్ఠురాలను బాగా చవిచూసింది. అందువల్ల నవచైనాకు యితరదేశాలను పాదాక్రాంతం చేసుకోవాలనే సామ్రాజ్యతత్వాని కాస్కారం లేదని. నవ చైనా తన స్వంత విషయాలలో యితరుల జోక్యాన్ని సహించదనీ, తా నితరుల విషయాలలో జోక్యం కలిగించుకోదని నా విశ్వాసం. కాని తన ఆత్మరక్షణకు విఘాతం కలిగినప్పుడుమాత్రం నిద్ర పోకుండా మెలకువతో వర్తిస్తుందనికూడా తెలుసుకోవాలి.

నవచైనా సోవియట్ యూనియన్‌యొక్క ఉపగ్రహమనే ప్రచారాన్ని అంతర్జాతీయ యుద్ధోన్మాదులకూటమి విరివిగా కొన సాగిస్తున్నారు. చైనాకు స్వయంగా తా ననుసరించే అంతర్జాతీయ విధానం లేదనికూడ దుష్ప్రచారాన్ని చేస్తున్నారు. ఇది కేవలం చైనాను అనుమానించడానికీ, నవచైనా విషయంలో అపోహలు కల్పించి ఆసియాప్రజలను మభ్యపెట్టి చైనాతో స్నేహసంబంధాలను కోరే చిన్నదేశాలను భయభ్రాంతుల్ని చేయడానికీ కొనసాగించే ప్రచారమే. చైనా ఏ దేశానికీ ఉపగ్రహం కాదు. 60 కోట్ల జనాన్ని తన గుప్పెట్లో పెట్టుకుని ఆటలాడించడాని కా దేశం సాహసించదు. చైనా - సోవియట్ దేశాలమధ్య దృఢతరమైత్రి వుండ డమూ, పరస్పర సహకారంతో వర్తించడమూ, సామ్రాజ్య వాదుల యుద్ధోన్మాదాన్ని అరికట్టడానికి ఇరువురూ కలిసి ఒక మార్గా న్ననుసరించడమూ ప్రపంచానికంతా తెలిసిన విషయమే. కాని ఆర్థికవిధానంలోను, ఆంతరంగిక వ్యవహారంలోను, విజ్ఞానంలోను, సంస్కృతిలోను చైనా సర్వస్వతంత్రంగా ప్రవర్తిస్తోంది. చైనా అనేక దశాబ్దాలక్రితం పోగొట్టుకున్న తన స్వతంత్రంతోపాటు ఆత్మను

కూడ తిరిగి పొందింది. తన చరిత్రపట్ల, భాషపట్ల, విజ్ఞానంపట్ల, నాగరికతపట్ల చైనా విపరీతమైన అభిమానాన్ని కలిగివుంది. చైనాను ఒక దేశంయొక్క ఉపగ్రహమనడం ప్రపంచంలో నాల్గోభాగపు ప్రజానీకాన్ని అవమానించడమూ, సత్యాన్ని హత్యచేయడమూ అన్నమాట.

నవచైనా ప్రపంచశాంతి కోసరం గాఢంగా తపించుతోంది. చైనా ప్రభుత్వం, ప్రజలు ఏకకంఠంతో శాంతికోసరం ఘోషిస్తున్నారు. సినిమాలలో, నాటకాలలో, ఉపన్యాసాలలో, వాఙ్మయంలో అన్నిటిలో ప్రపంచశాంతి వర్థిల్లాలి అనే భావాన్నే ప్రచారం చేస్తున్నారు. నవచైనా తన ఉజ్వల భవిష్యత్తుకోసరం సోషలిజాన్ని స్థాపించడానికి యత్నం చేస్తోంది. ఎన్నో ప్రాజెక్టులు, ఫ్యాక్టరీలు నిర్మాణంచేస్తోంది. తన శక్తినంతా నిర్మాణకార్యక్రమం కోసరం కూడతీసుకునేటందుకు నిమగ్నమై వుంది. యుద్ధోన్మాదంలో చిక్కుకొని యీ అభివృద్ధినంతా ఆటంకపరచి తన ప్రజానీకంయొక్క సౌఖ్యాన్ని, శ్రేయస్సును బలిచేయడాని కది యత్నించడంలేదు. ఇంతేగాక అనేక సంవత్సరాలు విప్లవంలో అనేక పాట్లుపడి ఇప్పుడే తలలెత్తుకుంటూన్న ప్రజల శాంతిసౌఖ్యాలను విడిచిపెట్టి రక్తప్రవాహంలో యీదడానికి యత్నం చేస్తుందనడం హాస్యాస్పదమైన విషయం. తన ఆత్మరక్షణకోసరం సిద్ధంగా వుండడం సహజమైన విషయమే. అంతమాత్రాన చైనాను యుద్ధోన్మాదుల గుంపులో జమకట్టడం కేవలం హాస్యాస్పదం. ఇతర ఆసియాదేశాలను భయభ్రాంతులనుచేసి తమ పథకంలో విలీనం చేసుకోడానికి సామ్రాజ్యవాదులు చేసే ప్రచారమే యిది. నవచైనా నాయకత్వం కమ్యూనిస్టులచేతిలో వున్నా, చైనా పూర్తిగా కమ్యూనిస్టుదేశంకాదనీ, కేవలం తదనుగుణ్యమైన సిద్ధాంతాలను పురస్కరించుకొని సోషలిజం స్థాపించడానికి యత్నం చేస్తోందని నా అభిప్రాయం.

నవచైనాలో లంచగొండితనమూ, వడుపువృత్తి, బ్లాక్ మార్కెట్ విధానము, బిచ్చమెత్తే వృత్తీ పూర్తిగా రూపు మాప బడ్డాయి. ప్రతి స్త్రీ పురుషుడు యేదో ఒక వృత్తివల్ల పొట్టపోసు కోవలసిందేకాని, ఒకరి దయాధర్మంమీద ఆధారపడే విధానానికి అక్కడ తావులేదు.

లంచగొండితనాన్ని, బ్లాక్ మార్కెట్టును రూపుమాప డంలో నవచైనా ప్రభుత్వం చాల నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించింది. ప్రజల్ని పీల్చిపిప్పిచేసే యీ సంఘద్రోహుల విషయంలో జాలి తలవకుండా వారిని రూపుమాపింది.

స్త్రీలపైన పురుషులకుండిన నిరంకుశాధికారాలు కూడా నవచైనాలో రూపుమాపబడ్డాయి. బహుభార్యాత్వమూ, ఉంపుడు కత్తెలను ఉంచుకోడమూ నిషేధింపబడ్డాయి. స్త్రీలకు పురుషు లతోపాటు ఆర్థిక, రాజకీయ స్వతంత్రం ఈయబడింది. అనేకవేల సంవత్సరాలనుండి కేవలం పురుషుల విలాసంకోసరం ఉపయోగింప బడ్డ స్త్రీలు నేడు పురుషులతోపాటు సమానమైన హక్కులను పొంది పరిశ్రమలలోను, విద్యాసంస్థలలోను, ప్రభుత్వశాఖలలోను సమానబాధ్యత వహిస్తున్నారు.

నవచైనాలో కార్మికోద్యమం స్వతంత్రంగా లేదని, కార్మిక నాయకులు ప్రభుత్వాధిపత్యానికి కట్టుబడి వున్నారని ప్రభుత్వ యంత్రమే కార్మికోద్యమాన్ని తెరవెనకనుంచి నడుపుతోందనీ కూడా ప్రచారం జరుగుతోంది. చైనా ప్రస్తుత పరిస్థితి, చైనాపై సామ్రాజ్యవాదుల ద్వేషం, నవచైనా ప్రభుత్వాన్ని కూలద్రోయ డానికి సామ్రాజ్యవాదులు వారి యేజంట్లు పన్నిన కుట్రలు, నవ చైనాపై ఆర్థిక, వాణిజ్యదిగ్బంధనం జరిపి చైనాను కృంగదీయడా నికి వేసిన యెత్తులు, చైనా పరిశ్రమలను నాశనంచేసి చైనాను తమ మార్కెటుగా వినియోగం చేసుకునేందుకు ప్రపంచ పెట్టు బడిదారులు పడ్డ తాపత్రయం, విప్లవానంతరం కొమిన్‌టాంగ్

ఏజెంట్లు నవచైనాను మళ్ళీ సామ్రాజ్యవాదులకు కట్టబెట్టడానికి చేస్తున్న దేశద్రోహ చర్యలు—ఇవన్నీ మరచిపోకుండా కొంచెం తీవ్రంగా ఆలోచిస్తే, ప్రపంచ దుష్టశక్తుల నెదుర్కోడానికి చైనా ప్రభుత్వం కార్మికవర్గంపైన పూర్తిగా ఆధారపడవలసి వుందని స్పష్టంఅవుతుంది. ఇంతేగాక, నవచైనా ప్రజానీకమంతా కేవలం తన ఉత్పత్తిమీదనే జీవితం గడపవలసిన పరిస్థితి యేర్పడిందనీ, దాన్ని జయప్రదంగా ఎదుర్కోడానికి కార్మిక సంస్థలకూ, ప్రభుత్వానికీ మధ్య సన్నిహిత సంబంధం యేర్పడడం అవసరమనీ తోచకపోదు.

కార్మిక నాయకులు ఉత్పత్తివిషయంలోను, క్రమశిక్షణ విషయంలోను ప్రభుత్వంతో చేతులు కలిపి, ప్రస్తుత అంతర్జాతీయ విధానాలవల్ల యేర్పడ్డ క్లిష్టపరిస్థితుల నెదుర్కొని వాటినుండి బయటపడడానికి ప్రభుత్వమూ, ప్రజలూ, కార్మికవర్గమూ యేకోన్ముఖంగా పురోగమించడానికి ప్రయత్నంచేయడం అత్యంత అవసరమైన విషయం. లేనియెడల అనేక సంవత్సరాల కృషి ద్వారా, అపరిమితత్యాగంద్వారా పొందిన స్వాతంత్ర్యానికే విఘాతం వాటిల్లవచ్చు. నేటికీ యుద్ధపరిస్థితులలోవుండే దేశంలాగున్న చైనాలో కార్మికులు తమ ప్రభుత్వంతో సహకరించే విధానం అవలంబిస్తున్నారు. ఇంతమాత్రాన కార్మికుల నణగగొట్టి, వారి సంస్థల స్వాతంత్ర్యతకడ్డు తగులుతున్నారనడం పూర్తిగా అసత్యం. కార్మికవర్గాని కిదివరకు యే ప్రభుత్వంలోను యేర్పడని రక్షణలు, హక్కులు, సౌకర్యాలు నవచైనా ప్రభుత్వంలో యేర్పడ్డాయి. వారి జీవితావసరాల విషయాలలో ప్రాలుమాలిక లేకుండా శ్రద్ధవహించబడుతోంది.

నవచైనాలో 7 కోట్లమంది నిర్బంధ దాస్యవిధానంలో పనిచేస్తున్నారని 'స్వేచ్ఛా' దేశాల కార్మికసంస్థ అనేది ఒకటి (International Confederation of Trade Unions) ఇటీవల ప్రకటించింది. ఇన్నికోట్లజనం నిర్బంధవిధానంలో మ్రగ్గిపోతూంటే,

నిర్మాణ కార్యక్రమంలో ప్రజానీకంనుంచి ప్రభుత్వానికి సహకారం యెలా దొరుకుతుందో బుద్ధిమంతు లాలోచించుకోవలసిన విషయం. చైనాలో కొన్నిలక్షలమంది దాస్యశృంఖలాలలో బంధింపబడివున్న విషయం ఒకవిధంగా నిజం. అయితే వీళ్ళంతా విముక్తచైనాలో కాకుండా తైవాన్ దీవిలో చాంగ్కైషేకు నియంతృత్వంలో అమెరికా సామ్రాజ్యవాదుల బందీలైవున్నారు. వీళ్ల సంరక్షణకోసం అనే నెపంతో అమెరికా యీ దీవిచుట్టూ తన నావికాసైన్యాన్ని నిలిపింది. ఇది వీళ్ల రక్షణ కోసరమో, లేక తమ స్వతంత్రంకోసరం చాంగ్ నియంతృత్వాన్ని పడదోయడానికి విప్లవం జరిపితే తమను అణగగొట్టడానికో తైవాన్ ప్రజలు, ప్రపంచంకూడ ఒకనాడు తెలుసుకుంటారు.

నవచైనాలో ఆశ్చర్యకరమైన విషయం, 60 కోట్ల జనం—స్త్రీ పురుషులు, బాలబాలికలు—అంతా ఒకేవిధమైన దుస్తులు ధరిస్తారు (ఎవరో కొంతమందితప్ప). వీళ్ళంతా నీలిరంగు లాగులు, కోట్లు ధరిస్తారు. పోలీసు సిబ్బంది, సైనికులుమాత్రం కాకీదుస్తులను ధరిస్తారు. దీన్నిబట్టి కొందరు చైనాలో ప్రజలకు తమ కిష్టమైన దుస్తులు ధరించడానికికూడా స్వతంత్రం లేదని చెప్పడమూ, ప్రచారం చేయడమూ జరుగుతోంది. ఇదంతా ఒక సైనికవిధాన (Regementalism) మని నింద మోపుతారు. ఈ విషయంలో కూడా కొంచెం ఆలోచించి మాట్లాడాలి. విముక్తికి ముందు చైనాలో కోట్లకొలది ప్రజలకు తిండీ, బట్టా వుండేవి కావు. వీళ్ళందరికీ యివి దొరికేటట్లు చేయడం నవచైనా ప్రభుత్వంయొక్క విధ్యుక్తధర్మమయింది. అందువల్ల అందరికీ అందుబాటులోవుండే దుస్తులను తయారుచేయడం కర్తవ్యమైంది. సామ్రాజ్యవాదుల వాణిజ్య దిగ్బంధనంకూడ యిందుకు కొంతవరకు కారణంకావచ్చు. అదీగాక ప్రతిదేశంలోనూ దుస్తులు శీతోష్ణాలకు తగినట్లు యేర్పడుతూండడంకూడ సహజమైన విషయం.

ఒక దేశంలోని ప్రజానీకమంతా ఒకేవిధమైన దుస్తులను ధరించడం వాళ్ల ఐకమత్యానికి, సర్వసమానత్వానికి, జాతీయతకు నిదర్శనం. ఈ విషయాన్ని ఆలోచించకుండా ఒకదేశాన్నిగురించి చాల తేలికగా మాట్లాడడం వారి సంకుచిత స్వభావాన్ని వెల్లడిస్తుందని నా అభిప్రాయం.

ఆంగ్లభాష కిదివరకుండిన ప్రాధాన్యత పూర్తిగా రూపుమాపబడింది. నేడు చైనాలో ఆంగ్లభాషలో పండితులైనవారు కూడ ఆ భాషలో మాటలాడరు. తమ మాతృభాష అయిన చైనాభాషలోనే మాడలాడుతారు. దుబాసీలద్వారా తమ ప్రసంగాల్ని అనువదింపజేస్తారు. ఇది ఒకొక్కప్పుడు కొంత అపోహకు కారణమైనా, తమ జాతీయతకు వారు పునర్జీవం కలిగించారు.

చైనాలో ప్రజలు తమ కిష్టమైన మతాన్ని అవలంబించడానికి స్వాతంత్ర్యం వుంది. కాని, నవయువకుల్లో మతంపై విశ్వాసం సడలిపోతూంది. మతంపేరిట యిదివరకు జరిగిన అవినీతి, అత్యాచారాలు, మతాన్ని పురస్కరించుకొని ఫాదరీలు పన్నిన కుట్రలు, మతాధిపతులు అధికారాన్ని హస్తగతం చేసుకొని ప్రజాబాహుళ్యాన్ని దాస్యశృంఖలాలతో బంధించి వాళ్ల ఆత్మలకుచేసిన ద్రోహం చాలవరకు కారణమై వుండవచ్చు. ఇవన్నీకలసి యువకులలో ఒకవిధమైన భావ విప్లవానికి దారితీశాయి. దీనికితోడు నేటి విద్యావిధానం ప్రజల ఆశయాలు, వర్గరహితమైన సంఘ నిర్మాణయత్నంకూడ కారణమై యుండవచ్చు. ప్రభుత్వం అనేక మందిరాలను మరమ్మతుచేసి కాపాడుతోంది. ఎన్నో చర్చిలు, మశీదులున్నాయి. వీటి విషయంలోకూడ ప్రభుత్వం యెంతో శ్రద్ధ వహిస్తోంది. ప్రజలు మతంపేరిట యేర్పరచుకున్న మూఢవిశ్వాసాలను, ఛాందసభావాలను విసర్జించి తమ కనుగుణ్యమైన మార్గంలో పురోగమిస్తున్నారు.

గత నాలుగేళ్లలో చైనా దేశపటాన్ని, ప్రజలను ఇంతగా మార్చి, యింత అభివృద్ధికి కారణమైన మహత్తరశక్తిని గ్రహిం

చాలి. నవచైనా నాయకులు తమ సిద్ధాంతాలకే ప్రాముఖ్యం ఈయకుండా, అంతా తమకే తెలుసుననే అహంభావానికి లోను కాకుండా, అనుదినం ప్రజలనుంచి క్రొత్తపాఠాలను నేర్చుకుంటూ, కార్యసాధనలో ప్రజలంతా తమ్మనుకరించేటట్లు నడుస్తారు. తమతో ఏకీభవించని వాళ్లను, వెనకపడివున్న వాళ్లను యీసడించుకోకుండా, వాళ్ల అభిప్రాయాలకుకూడ కొంత విలువనిచ్చి, అవి యెంతవరకు సక్రమమైనవో, యెంతవరకు ఆచరణీయమైనవో తెలుసుకుందుకు ప్రయత్నిస్తారు. తాము తమ సిద్ధాంతాలపట్ల, అభిప్రాయాలపట్ల యెంత స్థిరచిత్తులో, యితరులూ అంతేనన్న విషయాన్ని మరచిపోరు. తమ ప్రవర్తన యెంత స్వచ్ఛమైనదో యితరుల ప్రవర్తనకూడ అటువంటిదే అను విషయాన్ని దృష్టిలో వుంచుకుంటారు. ప్రభుత్వాధిపత్యము, నాయకత్వము కమ్యూనిస్టులదయినా, అధికారాన్నంతా తామే హస్తగతం చేసుకుందామని ఆదుర్దాపడరు. వ్యక్తులకు కాకుండా సిద్ధాంతాలకు విలువనిస్తారు.

సిద్ధాంతాలలో, రాజకీయ పరిజ్ఞానంలో తమతో యేకీభవించని వారి సమర్థతకు, అనుభవానికి పూర్తి విలువనిచ్చి, వారితో దేశానికెంత లాభముందో అంతవరకు వినియోగం చేసుకుంటారు. వాదోపవాదాలతో కాలం వ్యర్థం చేయకుండా, కార్యసాధనలో పూనిక వహిస్తారు. త్యాగం, సత్ప్రవర్తన, అభ్యుదయకాంక్ష, దేశభక్తి, పట్టుదల కేవలం తమకే వున్నవని గర్వించరు. తమను వ్యతిరేకించే వాళ్ళలోనూ యీ మహోత్కృష్ట మానవ ఆశయాలుండ వచ్చుననే సత్యాన్ని గుర్తిస్తారు. ప్రతిమానవునిలో వుండే విశిష్టతను దేశాభ్యుదయంకోసరం వినియోగించుకునేటందుకు యత్నించేస్తారు. ఎన్ని కష్టాలున్నా ఎన్ని అడ్డంకులున్నా దృఢసంకల్పంతో ముందుకు నడుస్తూ, యితరులను నడపడానికి యత్నం చేస్తారు. చైనా నాయకులలో వుండే యీ ఉత్తమగుణాలే నేటి చైనా అభివృద్ధికి కారణమయ్యాయి.

నవచైనాలో నదులన్నీ పాలతోను, తేనెతోను ప్రవహిస్తు న్నాయని చెప్పడానికి నేను సాహసించడం లేదు. ప్రజల జీవిత పరిమాణాలెంతో అభివృద్ధి చెందవలసి వుంది. బీదరికము, అజ్ఞానము, అమాయకత్వము ఇంకా కొంతవరకు వాసం చేస్తున్నాయి. వీటిని రూపుమాపాలి. కార్మికవర్గం యెంతో దేశభక్తితో పరిశ్రమ చేస్తోంది. వారి జీవితాలింకా సుఖంగా గడపడానికి యత్నం చేయాలి. నవచైనా ప్రజలు దృఢసంకల్పంతో, ఆత్మవిశ్వాసంతో, నైతికబలంతో, ఉత్తమమైన మానవాశయాలతో పురోగమిస్తు న్నారు. చైనా ప్రజలు శాంతిని, అభివృద్ధిని కాంక్షిస్తున్నారు. వాళ్ళు ప్రపంచ శాంతికోసరం, ఆసియా విముక్తికోసరం తహ తహ లాడుతున్నారు. చైనా అనేక శతాబ్దాల, చీకటిరాత్రుల దీర్ఘ నిద్రనుండి మేల్కొని, చైతన్యప్రభాతంలోకి అడుగుపెట్టి, ఉజ్వలమైన భవిష్యత్తువైపు పరుగెత్తడానికి యత్నం చేస్తోంది.

చైనా - భారతదేశాలు ఒకరినుంచి ఇంకొకరు నేర్చుకో తగిన విషయాలెన్నో వున్నాయి. ఈ రెండు దేశాలు సహనంతో, ప్రేమతో పరస్పరసహకారంతో వర్తించితే, ప్రపంచాన్ని చుట్టు ముట్టుతూండే యుద్ధజ్వాలల నరికట్టి, ప్రపంచ యుద్ధోన్మాదుల తీవ్రయత్నాలలో ఆసియాదేశాలు చిక్కుపడకుండా కాపాడి, ఆసియా స్వతంత్రాన్ని ప్రపంచశాంతిని చిరస్థాయి చేయగలవని నిస్సంకోచంగా చెప్పవచ్చు. ఈ మహోత్కృష్ట ఆశయంలో విజ యంసాధించాలంటే చైనా ప్రజలు, భారత ప్రజలు ఒకరినొకరు పూర్తిగా అర్థంచేసుకోవాలి.

# 11

# తైవాన్ సమస్య

ఆసియా శాంతిభద్రలకు, ప్రపంచశాంతికి, నవచైనా స్వతంత్రతకు మహోపద్రవకరంగా పరిణమించిన తైవాన్ చరిత్ర చాల విషాదకరమైంది. తైవాన్ దీవి ఖనిజసంపదలకు, ప్రకృతి రామణీయకతకు పేరుపొందింది. అనేక పర్వత శిఖరాలతో ఆకాశాన్ని చుంబించే యీదీవి శోభాయమానంగా వుంటుంది. ఇది చైనా దీవులన్నిటిలోకి ముఖ్యమైనది; పెద్దది. చైనా కేంద్రప్రభుత్వపు రాష్ట్రాలన్నిటిలోకి యిది చిన్నది. తైవాన్ పర్వత లోయలు చాల సారవంతమైనవి. ఈ లోయలలో విస్తారమైన తేయాకు పండుతుంది. ఇక్కడి మహారణ్యములనుండి అపారమైన కలప యితరదేశాల కెగుమతి చేయబడుంది. ప్రపంచంలో ఉత్పత్తిఅయ్యే కర్పూరంలో నూటికి డెబ్భైపాళ్ళు తైవాన్ దీవిలోనే ఉత్పత్తిచేయబడుతోంది.

ప్రపథమంగా ఈ దీవిలో కాలుపెట్టిన విదేశీయులు పోర్చుగీస్‌వారు. వీళ్ళు 1590 వ సంవత్సరంలో యీ దీవిలో కాలుపెట్టి, దీని ప్రకృతి రామణీయతకి అచ్చెరువొంది, దీనికి "ఇల్హాఫర్మోజా" అని పేరుపెట్టారు. (ఇల్హాఫర్మోజా అంటే సుందరతరమైన దీవి అని అర్థం.) ఈ దీవిలో నలభైకోట్ల టన్నుల నేలబొగ్గు, నూనెగనులు, బంగారుగనులు, గంధకపుగనులు ఉన్నాయి. యుద్ధకాలంలో నౌకాసైన్యాల భద్రతకు సురక్షితమైన రేవులున్నాయి.

చైనా చరిత్రలో యీ దీవి కెన్నో పేర్లున్నట్లు నిదర్శనాలున్నా, తైవాన్ అనేది దాని ప్రస్తుత నామం. అనేక శతాబ్దాల

నుంచి తైవాన్ చైనా ప్రభుత్వాధీనంలోనే వుంది. ఈ దీవిలో ఎనభై లక్షలమంది చైనా పౌరులున్నారు. వీరంతా తొమ్మిదో శతాబ్దంనుంచి ప్యూకీన్, క్వాంటంగ్ రాష్ట్రాలనుండి తైవాన్‌లో స్థావరం యేర్పరచుకుని అక్కడే వుండిపోయారు. చారిత్రక పరిశోధనలవల్ల, మూడో శతాబ్దంనుంచే తైవాన్ చైనాకు చెంది వున్నట్లు నిదర్శనలున్నాయి. చైనా ప్రభుత్వం యీ దీవినుంచి తొమ్మిదో శతాబ్దంనుంచి ముత్యాల వ్యాపారం సాగిస్తూవుండింది. షిన్-చీన్-వూ అనే చైనా ప్రముఖుడు తొమ్మిదో శతాబ్దపు పూర్వార్థభాగంలో కొంతమంది అనుచరులతో యీ దీవిలో స్థిర నివాసం యేర్పరచుకుని, దీని అభివృద్ధి కెంతో కృషిచేశాడు. తరువాత పన్నెండో శతాబ్దంలో అనేక వేలమంది చైనీయులు యీ దీవిలో నివాసం యేర్పరచుకుని, మంగోలియన్ తార్తారు దండయాత్రలను ధైర్యంతో యెదుర్కొని చైనా ఆధిపత్యాన్ని నిలుపుకుంటూ వచ్చారు. పదహారో శతాబ్దంలో చైనా కేంద్ర ప్రభుత్వం యీ దీవి సంరక్షణకు యెన్నో సైనిక శిబిరాలను, దుర్గాలను నిర్మించి అప్పటికే కొరియాను పాదాక్రాంతం చేసుకున్న జపాన్ సైనికదండయాత్రలను ప్రతిఘటించింది. 17 వ శతాబ్దంలో ఐరోపా సామ్రాజ్యతత్వం పశ్చిమ పసిఫిక్ ప్రాంతాలలో తన ఆధిపత్యాన్ని నిరాఘాటంగా నెలకొల్పుకోడానికి యత్నించి జయప్రదమైంది. దాని ఫలితంగా 1626 వ సంవత్సరంలో డాన్ అంటోనియో కార్ని యోవాల్డెస్ అనే స్పెయిన్ సైనికాధిపతి యీ దీవి ఉత్తరప్రదేశాలను ఆక్రమించుకుని, 16 సంవత్సరాలపాటు అధికారం చెలాయించాడు. 1674 వ సంవత్సరంలో డచ్చి సామ్రాజ్యవాదులు తైవాన్ దక్షిణతీరాన్ని తమ ఆధిపత్యంలోకి తీసుకున్నారు. తరువాత హాలెండ్ స్పెయిన్ ఆక్రమణను తుదముట్టించి 38 సంవత్సరాలపాటు అధికారాన్ని చెలాయించింది. అప్పటికి యీ దీవిలో చైనీయుల సంఖ్య ఒక లక్షవరకు వుండేది.

1652 వ సంవత్సరంలో కౌ-హ్స్యాయ్ - యీా అనే చైనా దేశభక్తుడి నాయకత్వంలో చైనా ప్రజలంతా యెదురు తిరిగి డచ్చి ఆధిపత్యాన్ని అంతమొందించడానికి యత్నించారు. ఈ విప్లవంలో కౌ బలి అయిపోయాడు. విప్లవం జయప్రదం కాకపోవడంవల్ల డచ్చి సామ్రాజ్యనేతలు నాల్గువేలమంది చైనా దేశభక్తుల్ని ఉరితీశారు. 1663 వ సంవత్సరంలో చెంగ్-చెన్-కుంగ్ అనే నాయకుడు మళ్ళీ విప్లవం లేవదీసి, డచ్చి సామ్రాజ్యాధిపత్యానికి అంత్యక్రియలుచేశాడు. ఇతడి నాయకత్వంలో తైవాన్ అనేకవిధాల అభివృద్ధి చెందింది. చైనా ప్రజలసంఖ్య రెండులక్షలవరకు పెరిగింది. చెంగ్-చెన్-కుంగ్ కుమారుడు చెంగ్-చెన్ నౌకా వ్యాపారానికి ప్రోత్సాహం కలిగించి, గొప్పవర్తకపు టోడలను నిర్మించాడు. వాటిద్వారా జపాన్, సయాం, ఇండోచైనా మొదలైన దేశాలతో విరివిగా వ్యాపారం జరిగే అవకాశాలేర్పడి తైవాన్ ఆర్థికంగా యెంతో అభివృద్ధిపొందింది. ఆతరువాత యున్ హో అనే చైనా పారిశ్రామికుడు స్వంత పెట్టుబడితో తైవాన్ గంధకపు గనులను అభివృద్ధిచేశాడు.

1683 వ సంవత్సరంలో చెంగ్-కుంగ్ మనుమడైన చెంగ్-కే-షాంగ్ పెకింగ్‌లోని మంచూా చక్రవర్తితో ఒడంబడిక చేసుకున్న ఫలితంగా తైవాన్ చైనా కేంద్రప్రభుత్వాధిపత్యానికి కట్టుబడి చైనాదేశంయొక్క ఒక రాష్ట్రంగా యేర్పడింది. 1772వ సంవత్సరం నాటికి క్వాంటుంగ్ రాష్ట్రంనుంచి, కాంటన్ రాష్ట్రంనుంచి అనేక వేల మంది చైనాపౌరులు తైవాన్‌లో స్థిరనివాసం యేర్పరచుకుని, పాడి పంటల అభివృద్ధికి నిరంతరకృషి చేశారు. ఇప్పటికి తైవాన్‌లో చైనాప్రజల సంఖ్య ఇరవై లక్షలవరకు పెరిగింది. 1885 వ సంవత్సరంలో తైవాన్ చైనాప్రభుత్వంచేత సంపూర్ణరాష్ట్రంగా గుర్తింపబడింది. కేంద్ర ప్రభుత్వంచేత తైవాన్ రాష్ట్రాధిపతిగా (గవర్నరుగా) మింగ్-చూన్ నియోగింపబడ్డాడు. అప్పటినుంచి తైవాన్ అభివృద్ధి పొందుతూవచ్చింది. ఈ దీవి సంరక్షణ కెన్నో రేవులు,

సైనిక స్థావరాలు నిర్మింపబడ్డాయి. 1891 వ సంవత్సరంలో కేలుంగ్ నుంచి తాయ్-పీ వరకు యీదీవిలో రైల్వేనిర్మాణంకూడ జరిగింది.

తైవాన్ అభివృద్ధిని, ప్రకృతి సంపదనుచూచి పాశ్చాత్యుల కళ్ళుకుట్టాయి. లంచగొండితనంవల్ల, అంతఃకలహాలవల్ల పతనమై పోతూన్న మంచూ ప్రభుత్వం యీ రాష్ట్రాన్ని సంరక్షించుకునే శక్తిసామర్థ్యాలను కోలుపోయింది. దాని ఫలితంగా 1850 వ సంవత్సరంనుంచి 1860 వరకు అమెరికా వణిజులు, రాజకీయవేత్తలు, ప్రభుత్వాధికారులు యీ దీవిని కబళించడానికి యత్నంచేశారు. 1874 వ సంవత్సరంలో కేహాంపియాంగ్ రేవులో నౌకా సైన్యాన్ని నిలుపుకుని, అమెరికా సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం కొద్దిరోజుల పాటు విజయపతాకా న్నెత్తింది. జపాన్ 1894 – 95 లో చైనా నడిగడ్డపై దండయాత్రజరిపింది. చైనా విదేశ రాజ్యాంగశాఖకు అధిపత్యం వహించిన లీ – హాంగ్ – చాంగ్, తైవాన్ దీవిని జపాన్ సామ్రాజ్యవాదులకు ధారాదత్తంచేస్తూ ఒడంబడికచేసుకుని చైనా ప్రజలకు ద్రోహంచేశాడు; కాని తైవాన్‌లోని చైనా దేశభక్తులు యీ ఒడంబడికను నిరాకరించి, తమ స్వాతంత్రతను సంరక్షించుకోడానికి పోరాడి యెంతో త్యాగంచేశారు. 1895 వ సంవత్సరాంతం వరకు వీళ్లు జపాన్ సామ్రాజ్య సైనికబలాల దాస్యానికి లొంగకుండా పోరాటం సాగించారు. కాని చైనా భూభాగంనుంచి యెటువంటి సహాయం లేకపోవడంచేత, జపాన్ సామ్రాజ్యబలాలముందు నిరాయుధులై నిలువలేకపోయారు. విధిలేక ఆఖరికి జపాన్ ఆధిపత్యానికి తలొగ్గారు. జపాన్ ప్రభుత్వం యీ దీవిలో సైనికబలాలతో మూడు లక్షల ఇరవైవేలమంది జపాన్ ప్రజలను దింపింది. తరువాత అర్థశతాబ్దంలో జపాన్ ఆధిపత్యంనుంచి విముక్తిపొందడానికి తైవాన్ ప్రజలు 20 సార్లు యెదురు తిరిగారు. 1930 వ సంవత్సరంలో హ్వా-కాంగ్ అనే ఉపాధ్యాయుడి నాయకత్వంలో జపాన్ దుండగాలను సహించలేక చైనా ప్రజలు మళ్ళీ విప్లవం లేవదీశారు. ఈ విప్లవం మొదట కొంత జయప్రదంగా కొనసాగినా,

జపాన్ సైనికబలాలు అమానుషంగా వర్తించి అణచి వేశాయి. హ్వా-కాంగ్ అనుచరులెందరో యీ విప్లవంలో తమ ప్రాణాలను ఆహుతి చేశారు. హ్వా-కాంగ్ జపాన్ ప్రభుత్వానికి లొంగకుండా అడవుల, గుట్టల పాలయ్యాడు. అతడి అనుచరులు కూడ కొంతమంది అతడితోపాటు అరణ్యావాసానికి పాల్పడ్డారు. ఈ దేశభక్తులు అడవులలో తలదాచుకుంటూంటే, జపాన్ సైన్యాలు విషవాయు ప్రయోగంచేసి వీళ్లందరినీ హత్యచేశాయి. హ్వా-కాంగ్ ఆత్మహత్య చేసుకున్నాడు.

1934 లోను, 1941 లోను జపాన్ సామ్రాజ్యాధిపత్యాన్ని తుద ముట్టించడానికి మళ్ళీ విప్లవాలు చెలరేగాయి. ప్రతివిప్లవం లోనూ తైవాన్ ప్రజలు, నాయకులుతిరిగి చైనా కేంద్రప్రభుత్వంలో తైవాన్ కలసిపోవాలనే ఆదర్శంకోసరం పాటుబడి తమ ఆశ యాన్ని వెలిబుచ్చుతూ వచ్చారు. ఈ స్వతంత్రపోరాటాలలో అయిదులక్షలమంది చైనా దేశభక్తులు తమ జీవితాలను అర్పించారు. 1945 వ సంవత్సరంలో రెండో ప్రపంచ సంగ్రామంలో జపాన్ పరాజయంపొందిన తరువాత తైవాన్‌చరిత్ర యింకోవిధమైన విషాదగాథగా పరిణమించింది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఫాసిస్టు నియంతృత్వ శక్తులన్నిటిని వ్యతిరేకించిన మిత్రరాజ్యాలన్నీ తైవాన్ ప్రజలకు జరిగిన అన్యాయాన్ని, అక్రమాన్ని తొలగించి వాళ్ళకి న్యాయం కలిగించాలని ఉద్ఘాటించాయి. 1943 డిసెంబరు మొదటి తేదీనాడు జరిగిన కెయిరో సమావేశంలో చైనా, అమెరికా, బ్రిటిషు ప్రభు త్వాలు (రూజ్వెల్టు - చర్చిల్ - చాంగ్ కై షేకు) జపాన్ దురా క్రమణకు గురియైన మంచూరియా, తైవాన్, పెస్కడోర్స్ మొద లైన ప్రదేశాలన్నిటినీ తిరిగి చైనా ప్రభుత్వానికి వశపరచా లని ప్రకటించాయి. ప్రెసిడెంటు రూజువెల్టు ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, దొంగిలింపబడిన ఆస్తులన్నీ తిరిగి వాటి స్వంత యజ

మానులకు చెందడం న్యాయం అని ఉద్ఘాటించాడు. ఈ ప్రకటననే సోవియట్ ప్రభుత్వంకూడ తరువాత ధృవపరిచింది.

జపాన్ పతనానంతరం, కొమింటాంగ్ ప్రభుత్వం తైవాన్‌లో తన అధికారాన్ని నెలకొల్పింది. ఈ ప్రభుత్వం చైనా ప్రజానీకాన్ని కొల్లగొట్టినట్లే తైవాన్ ప్రజలను కూడ కొల్లగొట్టడానికి యత్నించింది. 1947 వ సంవత్సరంలో ఈ ప్రభుత్వ విధానాన్ని నిరసిస్తూ శాంతియుతంగా ప్రకటించిన నిరసనసభలపై కొమింటాంగ్ ప్రభుత్వం తుపాకులు కాల్చి మారణకృత్యాలు కొనసాగించింది. చాంగ్ కై షేకు ఒకవైపు తైవాన్ ప్రజాప్రతినిధులతో రాయబారాలుజరుపుతూ, రెండో వైపునుంచి రెండు గొప్ప సైనికదళాలను తైవాన్‌పైకిపంపి ప్రజలను చిత్రవధ చేయించాడు. చైనాలో ప్రజాశక్తి విజృంభించి, చాంగ్ కై షేకు ముఠా దుష్పరిపాలననంత మొందించి ప్రజాస్వామ్యాన్ని ప్రకటించినపుడు తైవాన్ ప్రజలు తమకు కూడ విముక్తికలుగుతుందని ఆశించారు. కాని అమెరికా తన సైనికబలంతో, ఆయుధాలతో, మారణయంత్రాలతో చాంగ్ ప్రభుత్వానికి బాసటగా నిలచింది. అయినా తైవాన్ చైనాలో అంతర్భాగమనే విషయంపై యెటువంటి ఆక్షేపణను యే ప్రభుత్వము చెప్పలేక పోయింది. తరువాత 1950 జనవరి నెలలో ప్రెసిడెంటు ట్రూమన్, అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం చైనా ప్రజావిప్లవంలో జోక్యం చేసుకోదని, చాంగ్ ప్రభుత్వానికి సాయుధ సహాయంగాని, సలహాగాని ఈయడానికి పూనుకోదని ప్రకటించాడు. తైవాన్ నవచైనాలోని ఒకరాష్ట్రమనే విషయంలో యెటువంటి సందేహం వెలిబుచ్చలేదు. ఈ ప్రకటనను అమెరికా ప్రభుత్వం యెంతవరకు పాటించి గౌరవించిందో ప్రపంచానికంతా తెలుసు.

తైవాన్ విముక్తిని నిరోధించడానికి అమెరికా 1950 లో తన నౌకా సైన్యాన్ని పంపి, చాంగ్ కై షేకు రాక్షస ప్రభుత్వాన్ని పతనంనుంచి కాపాడి తైవాన్‌లో స్థిరంగా తిష్టవేసింది.

అతెడికి ఆర్థికంగా విపరీతమైన సహాయంచేసి నిలబెడుతూవచ్చింది. అప్పటినుంచి చాంగ్ తైవాన్‌లో అమెరికా సైనిక సంరక్షణలో తన అధికారాన్ని నిలుపుకుంటూ నవచైనా స్వాతంత్ర్యానికి, అభివృద్ధికి తన అమెరికా యజమానుల ప్రోద్బలంతో నిరోధాలు కల్పించడానికి విశ్వప్రయత్నంచేస్తూ విఫలమౌతూ వున్నాడు.

1949 లో చైనాలో చాంగ్ ప్రభుత్వ పతనాన్ని గురించి ప్రస్తావిస్తూ "ఈ ప్రభుత్వం లంచగొండి తనంతోను, స్వార్థపరత్వంతోను, అసమర్థతతోను, కూలిపోతూంది. అమెరికా యుద్ధంలో తనకు జయంకలిగించి ఈ పతనం నుంచి కాపాడుతుందని తలుస్తోంది" అని అమెరికా బాహాటంగా చాంగ్ కై షేకు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తూ ప్రకటనలు చేసింది. ఈ అమెరికా ప్రభుత్వమే చైనాలో పతనం అయిపోయిన చాంగ్ నాయకత్వాన్ని, అధికారాన్ని తైవాన్‌లో నెలకొల్పి, దాన్ని తన సైనికబలంతో కాపాడుతోంది.

తైవాన్‌లో చాంగ్ ప్రభుత్వం ఏ విధంగా వర్తిస్తూందో కొంచెం తెలుసుకోవడం అవసరం. తైవాన్ ప్రజలపైన 1949 లో వుండిన వివిధ పన్నులభారం 1953 నాటికి (నాలుగేళ్ళలో) 37 రెట్లు పెరిగిపోయింది. దీనితో తైవాన్ ప్రజలు అప్పుడప్పుడు చందాల పేరుతో తమ శక్తికిమించిన ముడుపులను చెల్లించవలసి వస్తోంది. చాంగ్ ప్రభుత్వానికి ముందు తైవాన్‌లో 1948 లో 9400 కర్మాగారాలు (ఫ్యాక్టరీలు) వుండేవి. వాటిసంఖ్య 1954 లో 6000 కు తగ్గింది. 1954 లో అమెరికా-చాంగ్ ప్రతినిధుల విచారణ సంఘం ఒకటి తైవాన్ పారిశ్రామిక పట్టణాల ఆర్థిక పరిస్థితినిగురించి విచారణ జరిపి, ఈ పట్టణాలలో నివసించే కుటుంబాలు నూటికి 56 పాళ్లువిపరీతమైన అప్పులలో మునిగిపోయివున్నాయనీ, ఈ అప్పులలో నూటికి 46పాళ్లు ఆహారపదార్థాలు కొనడానికి, 17 పాళ్ళు రోగాల చికిత్సలకు, 21 పాళ్ళు ప్రభుత్వపు పన్నులను చెల్లించడానికి చేయబడినవనీ ప్రకటించినట్లు హాంగ్ కాంగ్ పత్రికలే ప్రకటించాయి.

చాంగ్ ప్రభుత్వంలో పసిపిల్లలను యువతుల్ని జీవితావసరాలకోసరం విక్రయించుకునే అధ్వాన్న పరిస్థితి లీ సుందరదీవిలో యేర్పడ్డాయి. ఒక్క కీలుంగ్ పట్టణంలోనే 60 వేలమంది వయో స్త్రీలలో పదివేల మంది పడుపువృత్తిలో జీవిస్తున్నారనీ, యీ వృత్తిలో 12 సంవత్స రాల బాలికలుకూడ వున్నారనీ తైవాన్ పత్రికలే ప్రకటించాయి. చాంగ్ చైనాలో అనుసరించిన రాక్షసవిధానాలన్నీ తైవాన్‌లో అమలుపరుస్తూ, ప్రజాబాహుళ్యాన్ని బీభత్సంచేస్తున్నా, ప్రజలు యీ రాక్షస ప్రభుత్వంనుంచి విముక్తిపొందడానికి యత్నంచేస్తూనే వున్నారు. 1955 జనవరినెలలో తైవాన్ కార్మికులందరూ చాంగ్ ప్రభుత్వాన్ని కూలద్రోసి స్వతంత్రం పొందడానికి చేసిన ప్రయ త్నాలను కొమింటాంగ్ ప్రభుత్వం అమెరికా ఆయుధాలతో అణగగొట్టడానికి యత్నిస్తోంది.

ఆసియాఖండంలో తన ఆధిపత్యాన్ని నిలుపుకుని, వెనక బడిన దేశాల్ని ఆర్థికంగా లొంగదీయడానికి అమెరికా కొరియా అంతఃకలహంలో జోక్యంచేసుకుని, తన సైనికబలాలను వినియో గించింది. ఆసియారాజ్యాలు తమ దీర్ఘనిద్రనుండి మేల్కొన్న తరువాత అమెరికా యీ విధానాన్ని యెంతోకాలం కొనసాగించ లేకపోయింది. ప్రధాని నెహ్రూ నాయకత్వంలో భారతదేశం చేసిన తీవ్ర కృషివల్ల, ఇతర ఆసియాదేశాల ఒత్తిడివల్ల ప్రపంచ సామ్రాజ్య శక్తులు కొరియా అంతర్యుద్ధాన్ని విరమించి శాంతి సంస్థాపనకు ఒప్పుకోవలసివచ్చింది. జెనీవా శాంతి సమావేశాలలో చర్చలు జరుగుతూండగానే జనరల్ వాన్ ఫ్లీటు ఐసెన్‌హోవర్ ప్రత్యేక ప్రతినిధిగా దూరప్రాచ్య రాజ్యాలు పర్యటనచేసి, ఇండో చైనాలో అంతర్యుద్ధం ముగిస్తే నవచైనాను కృంగదీయడానికి ఆదేశం చుట్టూ బలీయమైన సైనిక స్థావరాలను యేర్పరచాలని సూచిం చాడు. 1954 - 55 వ సంవత్సరాల్లో అమెరికా విదేశ రాజ్యాంగ శాఖ నివేదికలోకూడ యీ విధానాన్ని బలపరుస్తూ యిటువంటి సైనిక స్థావరాల నిర్మాణంలో జపాన్‌నుంచి పసిఫిక్ దీవులవరకు

యేర్పరుపబడే సైనిక స్థావరాలన్నిటికీ తైవాన్ కీలక స్థానంగా వుండేటట్లు బలపరచాలనీ, చాంగ్ నాయకత్వంలో తర్ఫీదుపొందిన లక్షలాది సైనికబలాలున్నాయనీ, అవసరం కలిగినప్పుడు వాటిని నవచైనాపై వినియోగించవచ్చుననీ సూచించారు. తరువాత నార్త్ ఈస్ట్ ఏషియా ట్రీటీ ఆర్గనైజేషన్ (Neato) ద్వారా జపాన్ దక్షిణ కొరియాలను కూడదీసుకొని సౌత్ ఈస్ట్ ఏషియా ట్రీటీకి (Seato) లంకె కలపి తైవాన్‌ని నవచైనా సంరక్షణకు, భద్రతకు ముప్పు తెస్తూ అమెరికా ఒక పథకాన్ని సృష్టించింది. చాంగ్ కై షేకుకి విపరీతమైన ఆర్థిక సహాయం చేస్తూ అతణ్ణి ఒక సాధనంగా వినియోగిస్తోంది. 1950–51 వ సంవత్సరంలో ఏడుకోట్ల పదిలక్షల డాలర్లు, 1951–52 లో 27కోట్ల 50 లక్షల డాలర్లు, 1952–53 లో 30 కోట్ల డాలర్లు, 1953–54 లో 32 కోట్ల డాలర్లు చాంగ్ కై షేకు ప్రభుత్వాన్ని పోషించడానికి అమెరికా భరణ మిచ్చింది. యీ ఆర్థిక సహాయంతోను అమెరికా సైనికబలంతోను, ప్రోత్సాహంతోను చాంగ్ సైనికులు చైనా సముద్ర తీరాలపైన దొంగదాడులు జరుపుతూ పారిపోతున్నారు.

ఒక అర్థశతాబ్దం జపాన్ సామ్రాజ్య బలాలు తైవాన్‌ని స్థావరంగా యేర్పరచుకుని ఇతర ఆసియా రాజ్యాల సంపదను, స్వతంత్రాన్ని కొల్లగొట్టడానికి యత్నించాయి. జపాన్ పతనానంతరం అమెరికా డాలర్ ప్రభుత్వం చాంగ్ కై షేకును ఒక ఆటబొమ్మగా వినియోగిస్తూ అదే విధానాన్ని అనుసరిస్తోంది.

1945 అక్టోబరు 25 వ తేదీనాడు జపాన్ ప్రభుత్వ ప్రతినిధి అయిన గవర్నర్ జనరల్ తైవాన్‌దీవిని చైనా ప్రభుత్వానికి వశపరచాడు. ఆనాడే చైనా ప్రతినిధి చెన్ - యీ "నేటినుండి తైవాన్ పెంగ్హూ దీవులు తిరిగి తమ మాతృదేశమైన చైనా దేశీయ పటంలో విలీనమైనాయి. ప్రభుత్వము, ప్రజలు దేశము చైనా

ప్రజా సార్వభౌమత్వానికి చెందినాయి" అని ప్రకటిస్తూ ప్రసారం చేశాడు.

1950 జూన్ 21 వ తేదీనాడు అమెరికా ప్రభుత్వం తన సప్తమ నౌకాదళాన్ని తైవాన్‌పైకి పంపుతున్నామని ప్రకటించింది. నాటినుండి తైవాన్‌లో చాంగ్ కై షేకును ముందుపెట్టుకుని తన ఆధిపత్యాన్ని నెరపుతూవుంది. 1954 డిసెంబరు 2 వ తేదీనాడు చాంగ్ కై షేక్‌తో పరస్పర సహాయ సైనిక ఒడంబడిక చేసుకుని తైవాన్‌లో స్థావరం యేర్పరచుకుంది. కొరియా యుద్ధకాలంలో తన నౌకా బలాలను తైవాన్‌కు పంపి, ఈ చర్య తైవాన్ తాటస్థ్యం కోసరం జరిపామంటూ అమెరికా ప్రకటించింది. కొరియా యుద్ధం ముగిసిన తరువాతకూడ తన సైనిక బలాలను తరలించకపోవడం వల్ల అమెరికాయొక్క నిజోద్దేశం వ్యక్తమౌతుంది. అమెరికా ప్రభుత్వమే అనేకసార్లు నైతికంగా, చారిత్రకంగా, నైసర్గికంగా తైవాన్ చైనాసొత్తని ప్రకటించి, ఇప్పుడు అమెరికా రక్షణకు తైవాన్ అవసరమనే ఒక వింతవాదనకు దిగింది. సామ్రాజ్యశక్తుల ఆయుధబలాలతో చాంగ్ చైనా భూభాగంపై తన విజయ పతాకాన్ని స్థాపిస్తాడని చైనానుంచి గెంటివేయబడ్డ ఈ దుష్టశక్తులన్నీ మళ్లీ చైనాలో తమ ఆధిపత్యాలను స్థాపించుకోగల్గుతామని కలలు కంటున్నాయి.

చాంగ్‌కై షేకుతో చేసుకున్న ఒడంబడికలో "చాంగ్ తన సైన్యంతో చైనాలో యేభాగాన్ని ఆక్రమింపగలిగితే ఆ భాగానికి యీ ఒడంబడికను వర్తింపచేయడానికి నూతన ఒడంబడికలను చేసుకోవచ్చు" నని అమెరికా అంగీకరించింది. చాంగ్ విదేశ రాజ్యాంగశాఖామాత్యుడైన షెంగ్ చెంగ్ వాన్ ఈ ఒడంబడికను భట్రాజులాగు పొగిడాడు. చాంగ్ ప్రభుత్వాధ్యక్షుడు ఓ-కే-యూ కూడ ఈ ఒడంబడికను హర్షిస్తూ "మేము చైనా నడిగడ్డపై నివసించే సోదర చైనీయులను సంరక్షించి వాళ్ళకు బంధ విముక్తి కలిగించడానికి యత్నిస్తాము. ఈ ఒడంబడిక ఆ పవి

త్రోద్యమాన్ని ఫలవంతంగా చేస్తుంది" అని చాటించాడు. అంటే స్వతంత్ర నవచైనాను అమెరికా పారతంత్ర్య నిగళాలతో బంధించడం తమ ధర్మం అని చాటించా డన్నమాట.

జెనీవా శాంతి సమావేశానంతరం, సౌత్ ఈస్ట్ ఏషియా కలెక్టివ్ డిఫెన్స్ ట్రీటీ తరువాత చాంగ్ కై షేకుతో తాము చేసుకున్న యీ ఒడంబడిక తమ పథకంలో ఒక ముఖ్యమైన లంకె అని డల్లస్ ప్రకటించాడు. చాంగ్ కై షేకు అమెరికా ఆట బొమ్మగా వర్తిస్తూ, నవచైనా శాంతికేకాక ఆసియా శాంతికి, స్వతంత్రతకు ముప్పు తెస్తున్నాడు.

ఈ పరిస్థితులలో తైవాన్ నవచైనా అభివృద్ధికి, స్వతంత్రతకే కాకుండా ఆసియా స్వతంత్రతకి, ప్రపంచశాంతికి మహోపద్రవం కలిగించే శత్రుసైనికస్థావరంగా యేర్పడిందని విశదమౌతూంది. పశ్చిమ సామ్రాజ్యశక్తుల ఆధిపత్యానికి లొంగి అనేక శతాబ్దాలు బానిసత్వంలో తమ గౌరవాన్ని, స్వతంత్రాన్ని కోలుపోయిన ఆసియా దేశాలన్నీ చైతన్యం పొంది దాస్యశృంఖలాలను త్రెంపుకుని నవశక్తితో నూత్నజీవితాన్ని పొంది, తాము పొందిన రాజకీయ స్వతంత్రాన్ని వినియోగించుకుని ఆర్థిక పునర్నిర్మాణానికి యత్నిస్తున్నాయి. వర్గరహితమైన సమాజాన్ని నిర్మించుకుని తామూ ప్రపంచరాజ్యాలతో సమానగౌరవ ప్రపత్తులతో శాంతియుతంగా అభివృద్ధిపొంది జీవించడానికి యత్నంచేస్తున్నాయి. ఈ ప్రయత్నానికి పశ్చిమ రాజ్యాలు అనేకవిధాల విఘాతాలు కల్పించి ఆసియా అభివృద్ధిని నిరోధించడానికి తీవ్రకృషి సల్పుతున్నాయి. తైవాన్ దీవిని, చాంగ్ ఆధిపత్యాన్ని యిందుకే వినియోగిస్తున్నాయి.

నవచైనాచుట్టూ సైనికస్థావరాలను యేర్పరచినట్లే భారత దేశంచుట్టూకూడా అనేక సైనిక ఒడంబడికలతో తమ ప్రాబల్యాన్ని స్థిరపరచుకుని, భారతదేశ శాంతి భద్రతలకు కూడ ముప్పు తెస్తున్నాయి. ప్రపంచశాంతికి భంగకరంగా వ్యవహరించే దేశాలకు

అమెరికా యేదో ఒకవిధంగా నాయకత్వం వహిస్తోంది. ఒకవైపు చాంగ్ కై షేకు ప్రభుత్వ దుష్పరిపాలనకు దోహదం కలిగిస్తూ తైవాన్‌లో తన సైన్యాలను స్థిరంగా నిలుపుకుని, నవచైనాను కృంగదీయడానికి యత్నం చేస్తోంది. ఇంకోవైపు పాకిస్తాన్‌తో సైనిక ఒడంబడికలు చేసుకుని, విపరీతమైన ఆయుధ సహాయం చేస్తూంది. మరోవైపు గోవా బుడతకీచుల వలసరాజ్యంకాదనీ, అది పోర్చుగల్ దేశంయొక్క రాష్ట్రమనీ ప్రకటిస్తూ, ఆ ప్రభుత్వానికి ధైర్యం పురిగొల్పుతూ, భారతదేశంయొక్క శాంతి భద్రతలకే ముప్పు తెస్తోంది. ఆసియా దేశాలు సామ్రాజ్యతత్వం యొక్క వలలో చిక్కకుండా తమ నూత్న స్వతంత్రాన్ని కాపాడుకోవాలి. వివిధ మతాలు, సంస్కృతులు, రాజకీయతత్వాలు అనుసరించే ఆసియా ఖండ ప్రజలంతా, ఒకరినొకరు సానుభూతితో అర్థంచేసుకొంటూ, సన్నిహిత సంబంధంకలిగి గౌరవ ప్రపత్తులతో వ్యవహరిస్తూ ఐకమత్యంతో వర్తించకపోతే, మళ్ళీ సామ్రాజ్యవాదుల మాయా వాగురులలోచిక్కి వాళ్ళ వలసదేశాలుగా మారిపోయే దుస్థితి దాపురిస్తుందనే విషయాన్ని గుర్తించి జాగరూకతతో మెలగాలి.

గోవా విముక్తి, తైవాన్ విముక్తి ప్రపంచశాంతికి, ఆసియా భద్రతకు అత్యవసరమైన విషయాలు. భారతదేశమూ, చైనా దేశమూ అనేక సహస్రాబ్దాలనుండి తమ పొరుగుదేశాలతో శాంతియుతంగా వ్యవహరించాయి. ఈ రెండు గొప్పదేశాలమధ్య దృఢతరమైన స్నేహసంబంధా లున్నాయి. కళలలోను, విజ్ఞానంలోను, సంస్కృతిలోను యెన్నో సన్నిహిత సంబంధా లున్నాయి. చైనా-భారత ప్రజానాయకులు, ప్రభుత్వనాయకులు అయిన పండిత నెహ్రూ, చౌ ఎన్ లై ప్రపంచంలో వివిధ వ్యవస్థలు, రాజకీయ సిద్ధాంతాలు కలిగిన దేశాలు శాంతియుతంగా సహజీవనం నెరపడానికి ప్రతిపాదించిన పంచశీలాలను ఆచరణలో పెట్టడానికి యీ రెండుదేశాలు కృషిచేస్తూ, యితరదేశాలకు మార్గదర్శకంగా వ్యవహరిస్తే ప్రపంచశాంతికి, అభివృద్ధికి అపారమైన సేవచేసి, ప్రపంచ

ప్రజా బాహుళ్యంయొక్క ఆదరాభిమానాలను పొందగలుగుతాయి. ప్రపంచం యింకో మహాసంగ్రామంలో చిక్కుకొని నశించిపోకుండా వుండాలంటే, యింకోమార్గంలేదు. సైనికబడంబడికలవల్ల, సాయుధ బలాలవల్ల శాంతిస్థాపనకు దిగడం మానవుడు తన ఆత్మవిశ్వాసాన్ని కోలుపోవడానికి సూచన అని ప్రపంచం గుర్తించే శుభ సమయంకోసరం అభివృద్ధిని కాంక్షించే శక్తులన్నీ పాటుబడాలి.

